(Collection of Metrical verse in Telugu)

First Edition 2001


*Price* **Rs 100/-**
**US $ 10**

Plot 10 Road 5
Jubilee Hills
Hyderabad 500 033

*Copies available at*

4 1-435 Bank Street Vignan Bhavan
Hy

Narayanaguda Hyderabad - 500 044

Opp Arya Samaj Mandir
Kachiguda Hyderabad 500 027.

*Designed & Printed at*
**Vipla Computer Serv--s**
*(Designers & Multi Colc Offset Printers)*
Nallakunta Hyderabad - 500 044
Phone 767 3309

## కృతి స్వీకర్తలు

సనాతన వైదిక ధర్మనిష్ఠులు
నిరాడంబర సంఘసేవా తత్పరులు
భారతీయ సాహిత్య, లలితా కళా సంస్కృతి పోషకులు
సుగుణమణులు - త్యాగధనులు
ప్రతిభాశాలురు - ప్రగతిశీలురు
ఆదర్శ దంపతులు

**శ్రీ సి రామకృష్ణ - శ్రీమతి కళ** లకు

స్నేహోపాయనంగా
అభిమాన పురస్సరంగా
ఈ

**జీవన శ్రుతులు**

## అంకితం

- జె. బాపురెడ్డి

5-2-2001
సికిందరాబాదు

# స్నేహాంకితం

శ్రీ రామకృష్ణ నామా !
కారుణ్య "కళా 'బి రామ ! కళ్యాణ గుణా !
దీరోదాత్తత, సంస్కృతి
పారమ్యము చెందు క్రాంతి బావుక సీమా !

చే బియ్యంబను వంశమే మిగుల వాసించెంది నీజన్మచే
నీ బుద్ధిన్ శివ "రామకృష్ణ" పదసాన్నిధ్యమ్ము వెల్గించగా
ఈ బాదామయలోకమందు నిజసాహిత్యార్ద్ర, నిస్వార్థ సే
వా బాంధవ్యుడవీవు, నీ నిబులు సర్వత్రా సదా పూజ్యులే!

కోలవెన్నురామ కోటీశ్వర ప్రబావ
విద్యవినయ, ధీ త్రివేణి వీవు
ఇల చరిత్రకారు డీశ్వరదత్తుని
స్ఫూర్తి పరిమళించు పుష్కరిణివి!

సుగుణములనెల్ల అజుడొక్క చోటచేర్చి
ఆత్మరక్షకు తగిన వ్యూహమ్ము నేర్పి
నీ మనో దుర్గమే బద్ర దామమంచు
ఉంచె వానిని అందు, దీవించె నిన్ను

మిట్టల్ పల్లములెన్ని వచ్చినను గంబీరాత్మతో సాగి, పెన్
గుట్టుల్, వానలు, ఎండలున్, చలియు, వా గుల్ చూచి భీతిల్లకన్
పట్టాలన్ విడిపోని ట్రేను వలెనే ప్రస్థానమ్ము సాగించు, నీ
దిట్టంబైన నిబద్ధ జీవితము, సందీపించు లోకంబునన్

ఉద్యోగమేది చేసిన
సద్యస్కృత సృజనశీల సామర్థ్యముతో
అద్యతన విద్యలకు, అన
వద్య పరాశక్తి వైభవమ్మిడిన సుధీ !

వృత్తి ప్రవృత్తులు, భక్తి ప్ర
పత్తులతో నిర్వహించి, పరహితమే సం
పత్తిగ మను మీ కంకిత
మిత్తును, మన స్నేహ చిహ్నమీ పద్యకృతిన్

నీజన్మదినము నేడిది
నీ జీవిత యాత్రలోన నిలిచెడి సుకళా
శ్రీజయకేతనమై, ధృతి
రాజిల్లుచు వచ్చు తరతరాలిట్టులనే!

అఖిలపురాణేతిహాసాలు, శోభిల్లు
నీ సనాతన దర్మ నిష్ఠలోన
సాహిత్య, సంగీత సంస్కృతుల్ వర్ధిల్లు
నీ సంఘ సేవాగ్ర నీతిలోన
వేద వేదాంగ సంవిదితమౌ సత్యాలు
బాసల్లు నీ సుజిజ్ఞాసలోన
లలిత కళావేదికలు వన్నె కెక్కును
నీ శివంకర భావనిదులలోన

అతుల శృంగేరి, కంచి పీఠాదిపతులు
శంకరాచార్య మంగళా శాసనములు
వరములయ్యేను మీకు, మీ వంశమునకు
శ్రీ కళారామకృష్ణ సంజీవులార!

సికిందరాబాద్
5 2 2001, సోమవారం

**జె బాపురెడ్డి**

# ముత్యాలసరం

ౖ ,౦

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం - ఈ మూడూ కవితా హేతువులు ఈ మూడూ ముచ్చటగా కలిసిన కవివ్యక్తిత్వం ఒక త్రివేణిసంగమం యౌవనంలో ప్రతిభ గంగలా ఉప్పొంగుతుంది క్రమంగా వ్యుత్పత్తి అనే యమున దానిలో కలుస్తుంది అభ్యాసం పరస్వతిలా అంతర్యా లో క్రమంగా ప్రతిభ వ్యుత్పత్తితో రాణించే దశ ప్రదర్శితమై, అది పరిణతి చెందిన సమయంలో - అభ్యాసంలో ఆ రెండూ ఓలలాడుతున్నట్లుగా భాసిస్తాయి శ్రీనాధాది మహాకవుల జీవితాలు గమనిస్తే వార్ధక్యంలో ప్రౌఢకవితాధార అశువుగా చాటువుగా అవలవోకగా, నల్లేరుమీద బండినడకలా ప్రవహించటం గమనిస్తాం మహాకవి బాపురెడ్డిగారు అంటువంటి దశలో ఉన్నారిప్పుడు

సద్య త్స్రజ్జితములు నా
పద్యమ్ములు వాని వెంట పడ భావమ్ముల్
హృద్యము లాద్యంతము రస
విద్యలకే విద్య యైన విద్య కవితయే"

అభ్యాసవశాన కవి మనసులో తొలకరించే భావాలన్నీ పద్యధారలుగా వర్షించటం ఒక వయోధర్మ ్ధర్మం అని అనలేకపోతున్నాం ఎందుకంటే ఆయన పలుకులో, పద్యంలో, పరుగులో భావంలో భాషలో, చివరకు వేషంలో డే వైఖరిని సప్రయత్న వార్ధక్యాన్ని జయించే సిద్ధమకరధ్వజం వారికి కవిత్వం కవిత్వం వారి జీవన శ్రుతి జీవనగీతి, జీవననీతి, జీవన విభూతి

డా॥ జె బాపురెడ్డి గారికి కవిత్వ సంజీవనీ విద్య తెలుసు అందుకే -

భావాలకు శబ్దమ్ములు
త్రోవలుగా ఒదుగవలయు, దొరలెడు మాటల్

భావాలె తమకు లొంగుచు
పోవాలనుకొనిన చచ్చిపోవును కవితల్"

అని అనగలిగారు అన్నట్లు తాము కవితలు రాయగలిగారు "భావాలకు శబ్దమ్ములు త్రోవలుగా ఒదుగవలయు' - అనే వాక్యం బాపురెడ్డిగారి కవితాలక్ష్యం

"నా ప్రత్యేకత నిత్యనూతనత వీణా వేణుసంగీతరా
గ ప్రత్యూషమము నానివాసము నిసర్గస్వాదు సౌందర్య భా
నీ ప్రక్షేపము నా విలాసము జగత్స్వప్న ప్రబుద్ధాంతరి
క్షప్రస్థానము నామహాశయము నక్షత్రాలు నాకావ్యముల్"

ఈ పద్యం బాపురెడ్డిగారి కవిత్వానికి లక్షణం, లక్ష్యం కూడా!

జీవితసాగరాన్ని మధించిన కవి అమృతానుభూతులను కవితల్లో తెట్టలు కట్టిస్తాడు చెప్పే వస్తువును బట్టి ఛందస్సు సహజంగా అమరవచ్చు స్వీయానుభవం పల్ల లోకం ఎదైనా నీతిని తెలుసుకోవాలని భావిస్తే బాపురెడ్డి గారి నోట కందం వెలువడుతుంది స్వీయానుభవాలలో లోక విమర్శ
ఆటవెలదులు కావచ్చు అనుభవాల దొంతరలను పేర్కొంటూ ఒక లోకసత్యాన్ని ఆవిష్కరింపదలచుకుంటే సీసపద్యం పుట్టుకొని రావచ్చు ఆత్మాశ్రయ పరాశ్రయ భావాభివ్యక్తిని పరిపక్వంగా పరివేదనగా వ్యక్తంచేయాలనుకున్నప్పుడు బాపురెడ్డిగారు వృత్తాన్ని ఎత్తుకోవచ్చు మనోభావాలను తేటపరచే మాటలను తేటగీతలో చెప్పవచ్చు భావాలకు తగిన శబ్దాలేకావు ఛందాలు కూడా త్రోవలుగా మారటం బాపురెడ్డిగారి కవితా విద్య పద్యాల్లోని భావాలు జీవనశ్రుతులు (జీవన వేదాలు) పద్యాల్లోని ఛందస్సులు జీవనశ్రుతులు (బ్రతుకులోని స్వర సంగతులు)

ఈ కావ్యంలో చాలవరకు ముక్తకాలే ఉన్నాయి కొన్ని ఖండకావ్యాలున్నాయి వాటిలో కూడా పద్యాలన్నీ ముక్తకాల వంటివే ముక్తకం సాహిత్యంలో బ్రతకాలంటే కవి ఆత్మీయతకు, ఆత్మావిష్కృతికి అచ్చమైన అభివ్య
పద్యాలన్నీ లయాత్మక స్వీయభావ సౌందర్యాభివ్యక్తులే ముక్తకం జాతి వార్తా

చమత్కారాలతో                                    ో చూచిన, సత్యాలను, వాస్తవాలను నిజాయితీతో వాస్తవ దృష్టితో ఆవిష్కరించే పద్యాలలో తన జీవితంలో పొందిన అనుభవాలకు భావితరాలవారికి తన ఆనవాళ్ళుగా అందించటానికి యత్నించే పద్యాలలో వార్తా లక్షణం వర్ధిల్లుతుంది జాతి వార్తా స్వభావాలను గాని, మరే భావస్ప                    ్ కడుపులో దాచుకున్న చమత్కారవైచిత్రగా వ్యక్తీకరించే పద్యాలలో చమత్కారం జీవిస్తుంది బాపురెడ్డిగారి 'జీవనశ్రుతులు' జాతివార్తాచమత్కార జీవన ప్రవంతులు

"హంతకు లెవరో తన శు
ద్ధాంతములో అప్తు లెవరొ అగుపించని దు
ర్ధ్వాంతములో మునుగుచు నే
డెంతయు చింతించు భారతాంబిక అకటా!"

నేటి సామాజిక రాజకీయ వాస్తవికతను వాస్తవంగా చెప్పే ఈ కందం చక్కని చిక్కని జాతి

"జండాలు మార్చుకొనిన ఎ
జండా అదియేను - స్వార్థ సముపార్జనముల్
గుండాల అండయండగ
గండాలే లేవు నాయకమ్మన్యులకున్"

ఈ పద్య                    -   ‿                    ్రకోటానికి మిగిలే వార్తా సత్యం!

"చెట్టు చెవిలోన పక్షులు
గుట్టుగ గుసగుసలు చెప్పు గోప్యము లేవో
అట్టిటు తలలూపును ఆ
చెట్టు సరే యనుచు బదులు చెప్పినరీతిన్"

చెట్టు కొమ్మల మీద పిట్టల సవ్వడులు చేయటం, గాలికి చెట్టుకొమ్మలు మెల్లగా కదలటం మనం నిత్యం వింటూనే ఉన్నాం కాని ఈ మానవీకరణం, పిట్టలు రహస్యాలు చెపుతుంటే చెట్టు తలఊపుతున్నదని ఊహించటం అపూర్వ చమత్కారదాయకం చెప్పిన వస్తువులో వాస్తవం ఉంది, వార్తఉంది, కానీ, ఆ రెంటినీ తనలో పొదివి కొన్న చమత్కారం ఈ పద్యా ,, పురస్కారం!

"ఛందము నానాలుకై
సుందర నాట్యమ్ము చేయు సురుచిరముగ నా
డెందము నవ కందములై
చిందును స్వచ్ఛంద భావచేతన రుతులన్

అని బాపురెడ్డిగారంటే మనం 'బాపురే' అని అంగీ వే!

మనసులోని ముద్దుముచ్చటలు చెప్పుకొనే ముత్యాలవంటి పద్యాలు ముక్తకాలు, ముక్తకాలు చెప్పే వు, స్వపరభేదాలుండవు ఒక్కోసారి చేతనాత్రయ విభాగయోగం కూడా ఉండదు అతడొక స్వేచ్ఛాజీవి అంతరాత్మ దిగంబర నృత్యం చేస్తుంది అయినా కళాసౌందర్య రేఖను కాదనదు కవితా స్పృహను వీడదు డా॥ బాపురెడ్డిగారి పద్యాలు ఈ దృష్టితో చూస్తే వాటి హొయలు హృదయరంజకాలుగా ప్రత్యక్షమౌతాయి

పేరడీలు రాయటం ఒక సరదా! అయితే పేరడీలు అనుకరణంగా కంటే అనుసృజనంగా ఉంటే అందం బాపురెడ్డిగారి పేరడీలు చాలవరకు అనుసృజనాలే

"అక్కరకు రాని నీతులు
గుక్కతిరుగకుండ కక్కు కూతల్ రాతల్
ఎక్కడ నిక్కిన నీల్గిన
గ్రక్కున వెలివేయవలయు గదరా బాపూ !"

సుమతీశతకంలోని "అక్కరకు రాని చుట్టము' అనే పద్యానికి ఇది పేరడీగా కనపడుతున్నా దాని తీరు వేరు,దీని తీరు సౌరు కృష్ణశతకంలోని "హరియను

రెండాక్షరములు ' అనే పద్యానికి పేరడీ
పునర్జన్మనెత్తింది

ఔనను రెండక్షరములు
మానిని ప్రకటించుదాక మౌన నిరీక్షన్
పూని చెలిపేరునే తన
ప్రాణములో ప్రాణమట్లు పరియించెనహో!'

పేరడీలో కూడా అది పెరేడ్ చేస్తుంది

డా॥ బాపురెడ్డిగారు సహజకవులు నిరంతరాన్వే
పర్యటించిన ప్రతిభావంతులు అటువేదాంతాన్ని జీవితసత్యాలతో వ్యాఖ్యానించే తత్త్వవేత్త, ఇటు తత్వాసాగరాన్ని , సౌందర్య బాహువులతో ఈదగలిగిన రసికవీరులు, అన్ని రసాలూ స్నేహరసంలోనే పుట్టి పెరిగి లయిస్తాయన్న రస రహస్యాన్ని బోధించే దార్శనికులు, మంచిని పెంచి మనిషిని ప్రేమించే మనస్వులు పద్యంతో ప్రౌఢంగా విహరించగలరు గేయంతో రమ్యంగా రమించగలరు పాటతో ఆటలాడగలరు వచన కవితతో రమణీయవిలాసాన్ని వెలార్చగలరు వాస్తవ భావాచిత్రాలను వేదాంత భావచిత్రాలుగా పరివర్తనం చేసే విద్య బాపురెడ్డి గారికి బాగా తెలుసు ఆయన వాస్తవ వేదాంతి

ప్రేయసిహాస మందు నిరుపేదల వేదనలందు చిన్ని పా
పాయిల కన్నులందు మధుపాయిల కమ్మని పాటలందు మి
త్రాయిత మానసమ్ముల విహాయసవీధులనే వెలార్చుచున్
పోయెడి భావతారకలెపో కలకాలపు నాదు కావ్య ముల్"

బాపురెడ్డి గారి పద్యాలు భావతారకలు! కాంతివీచికలు!

"ముత్యాల వంటి పద్యాల్
సత్యాలను మణులతోడ శారద మెడలో
స్తుత్య స్వరహారములై
నిత్యానందమ్ముగూర్చు నిఖిలావనికిన్

పద్య కవిత్వాన్ని గురించి చెప్పిన సాధారణ సూక్తిగా కనపడే ఈ పద్యం బాపురెడ్డిగారి పద్యకవితాలంకారం అందుకే ఈ కావ్యం శారద మెడలోని ముత్యాలసరం!

సరస్వతీ వరప్రసారమైన ఇలాంటి కవితోపహారం, లలితకళాపోషకులైన [illegible] మంగళప్రదం

శుభం భూయాత్

**జి వి సుబ్రహ్మణ్యం**

) కౌస్తుభ'


**› ఆచార్య తిరుమల**

1, నందిని కాంప్లెక్స్, మోజంజాహి మార్కెట్

దరాబాద్ - 95 ఫోన్ 461 9066


# స్వరపీఠిక

విశ్వవిఖ్యాత విద్వత్కవులు డా జె బాపురెడ్డి గారు రాచించిన యీ 'జీవన
ుతులు' పద్య కావ్యం చదివిన వెంటనే నాకు తిరుపతి కవుల -

**భారతముపై నెవరి యభిప్రాయముండె ?**

**మను చరిత మొద లెవరి సమ్మతులు విలిపె ?**

**తీపిలేని ఫలమ్ముపై దేనె చిలుక**

**నేమియగు ? దీపి గలదాని కేమి వలయు ?**

అనే పద్యం గుర్తొచ్చింది బాపురెడ్డి గారి రచనలన్నీ ఆపాత మధురాలు,
ంద్యంద రసవత్కిరణాలు

ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో - బాపురెడ్డి గారు నిత్య సాహిత్యోపాసకులై,
ిరంతర ప్రయోగ కుశలురై, తమ బహుముఖీన ప్రజ్ఞాపాటవాల చేత ఒక విశిష్ట
స్థానాన్ని సంపాదించుకున్నారు ఆయన సాహితీ ప్రస్థానంలో త్రివిధ దర్శనాలున్నాయి
పద్యవిద్యలో, గేయ నిర్మాణంలో, వచన కవితాభినవేశంలో
బాపురెడ్డిగారి సమగ్రసాహిత్యాన్ని సమీక్షించి చూస్తే ఆయన్ని జ్ఞానపీఠ బహుమతి
క్తిలో నిలబెట్టటానికి నాకేమీ అభ్యంతరం లేదు ప్రాక్పశ్చిమ
సాహిత్య సాగరాల్ని మథించిన మంధర మాయన మానసం అటువంటి మనసు
నుండి ఏ భావం ఉదయించినా అది జీవన శ్రుతులనే మీటుతుంది అనంతానంద
సీమలనే అందిస్తుంది

రస విద్యలకే విద్యయైన విద్య కవితయే అని, అందులోను పద్యమే నన్నయ,
తిక్కన్న,పోతన్న, శ్రీనాథ, పెద్దన, వేమనాది వరకవుల్ని కనిపెంచిందని ఆ పద్యాల్లో

కందాలు కందర్ప శృంఖాలాలని బాపురెడ్డి గారికి బాగా తెలుసు గుండె చప్పుడు నుండి కవితలు రావాలనే ఆయన నాలుకపై ఛందం సుందరనాట్యం చేస్తుంది భావాలకు శబ్దాలు త్రోవలుగా ఒదుగుతాయి

నిర్వ్యథన జీవి తమునకు
నిర్వ్యథ, నిర్వ్యూఢ పథము నిర్నిద్రతయే
నిర్వ్యూఢి అన్ని వెతలకు
నిర్వ్యాజ విశుద్ధ సత్య నిగమాచరణే ॥

అంటూ దుష్కర ప్రాసతో చెప్పిన యీ కందపద్యం చూస్తేనే తెలుస్తుంది బాపురెడ్డి గారి కెంత ఛందోధికారముందో! అలాగే ఆయన కవితా దృక్పథం జాతీయ అంతర్జాతీయ సరిహద్దుల్ని దాటింది, నక్షత్ర వీధుల్ని చుంబించింది

నా ప్రత్యేకత నిత్యనూతనత వీణావేణుసంగీత రా
గ ప్రత్యూషము నా నివాసము నిసర్గస్వాదు సౌందర్య భా
వ ప్రక్షేపము నావిలాసము జగత్వ్యాప్త ప్రబుద్ధాంతరి
క్ష ప్రస్థానము నా మహాశయము నక్షత్రాలు నా కావ్యముల్ ॥

తన కావ్యాలు నిత్య నూతన రాగ సౌందర్యంతో క్షతిలేని నక్షత్రాలని ఆయన చెప్పుకున్న దాంట్లో అత్యుక్తిలేదు ఎందుకంటే అమృతంలా హాలాహలాన్ని వెన్నెలా చీకటిని గ్రోలిన సమదర్శనంతో ద్వేషించిన జనమ్ము నై " నీ గుణ మిట్లే వరలుచుంట కోరుచునుందున్!!" అనుకోవటమే కాదు "కాంచలేనట్టి చీకట్లు కాంచికాంచి కరుగుచుంటిని దు ఖాశ్రు కణము నౌచు" అనుకునే బాపురెడ్డిగారు కవికి ప్రాకృతిక లక్షణమైన వేదనలోంచి వేదాన్ని పుట్టిస్తున్న మహామనీషి

బాపురెడ్డిగారి కవితకు సమత మానవతలు రెండు కళ్ళు, తాత్త్విక చింతన హృదయం విశ్వమానవాభ్యుదయం ఆత్మ సుధాముని అటుకులకే పులకించిన గోవిందునిలా - "కలవారు నేడు పేదల చెలిమికి చలియించిరేని శ్రేయస్కరమౌ" నని సమతను చాటుతూ -

వాదాల రైలు బండికి
వాదమ్మేదైన బోగి వలెనే తగులున్
నీ దేదొ చూచి యెక్కుము
ఏదైనను గమ్య మొకటియే! మానవతే!!

అని ప్రయాణించుమన్నారు మానవత ప్రధానంగా ప్రేమ సిద్ధాంతం మీద ఆధారపడి వుంటుంది అందుకే "అడుగక యిడు నీ ప్రేమను అడుగని వారికిని" అంటూ "లోకాధారము ప్రేమయె జీవిత సారము మన నిత్య సత్య సహజీవనమే" అని తీర్మానించారు అనంత సత్యా ౣ ౄవ్రతం నిశితం గానే వుంటుంది

ఎరుగని సత్యమ్ములు నీ
వెరిగిన యట్లురిమి ఒరుల హింసింపకుమా
జ్వర పీడి తునకు మందని
గరళమ్మిడి చంపబోకు గర్వాంధుడవై ॥

ఇంత నిశిత ధోరణి లో కూడా ఒక హసితం భావచిత్ర మవటం కూడా ఉంది చూడండి -

చెట్టు చెవిలోన పక్షులు
గుట్టుగ గుసగుసలు చెప్పు గోప్యము లేవో
అట్టిటు తల నూపును ఆ
చెట్టు సరే యనుచు బదులు చెప్పిన రీతిన్ !!

మరోచోట- 'నభమను గడియారములో ప్రభలీనెడి సూర్యచంద్ర వర కరయుగముల్, ఖరీ లో అంటారు ఇది గగన ఘంటాపథ దర్శనమని వేరే చెప్పవలసిన పనిలేదు కదా!

బాపురెడ్డిగారు కవుల్లో వేదాంతి, వేదాంతుల్లో కవి ఆయన భావభౌతిక వాదం ఎన్నెన్నో ఆలోచనలను రేకెత్తిస్తూ వుంటుంది

మనమున గల భావనలకు
ఘన తరమగు వాస్తు రూప కల్పన చేతున్
కనుపించు వస్తువులలో
కనుపించని భావసత్యకాంతులు నింతున్॥

ఇది పదార్ధ నిర్మాణ దర్శనం కాగ కుండలోని నీటిలో కన్పడే ఆకాశంలా

బ్రహ్మ ప్పుడే

చెప్పారు బాపురెడ్డి గారి లోకాతీతానుభూతి అద్భుతంగా వుంటుంది సాగరాన్ని చూసి-

నీ యుచ్ఛ్వాసము లే పయోధరములై నింగిన్, ధరా వర్షమై
ఆయాదేశ నదీ నదమ్ములయి నీయందే విధిన్ లీనమౌ
నో యారీతి సమస్త జీవులను ఏదో జీవనానంద సం
శ్రేయో విర్భవ మొంది యందె తుదకున్ లీనం బవున్ సాగరా ॥

అంటారు అలాగే మృత్యు వర్ణన లో

ఇల పూచినట్టి జీవులు రాలి నీ కంఠ
హారమ్ముజేర నున్నట్టి పూలె
వసుధ శ్రుతించు జీవ ధ్వనుల్ నీ కాలి
అందెల జేర నున్నట్టి ధ్వనులె
భువి రెక్కలార్చుప్రాణి విహంగరాజి నీ
నయనాగ్ని కాలనున్న శలభములె
బ్రతుకు బాటల సాగు ప్రాణులు నీ గర్భ
చితి జేర వచ్చుచున్న తెరువరులె
భూ చరమ్ములు జలచర ఖేచరములు
ధర వయోభేద లింగ భేదములు లేక
భవ దనంత క్షుదాగ్ని నార్పగ జగాన
కురియు క్షణికపు వానచిన్కులనిపించు ॥

ృత్యుగర్భాగ్ని నార్ప

ఇక్కడ 'చినుకు' శబ్ద ప్రయోగంలో ఎంత ధ్వనుందో రసజ్ఞులకే ఎఱుక! "ధ్వని స్తత్కావ్య ముత్తమమ్" అని ఆలంకారికుల మతం ఎంత ఉత్తమత్వం లేకపోతే - బాపురెడ్డి గారు-

కొమ్మలన్ని నరికి కొనిపోయినందుకు
చెట్టుగుండె బాధ తట్టు కొనెను
పక్షిగూళ్లు ఎన్నొ పతనమైనందుకు
కుమిలి కుమిలి చెట్టు కూలిపోయె !!

అనగలరో చూడండి ఈ పద్యం నిరాశ్రయ సంతానాన్ని చూసిన యే తల్లికైనా వర్తిస్తుంది అలా వర్తించేదే ఉత్తమ కవిత ఈ కృతిని, భక్తి జ్ఞాన యోగులైన శ్రీ కళారామకృష్ణ దంపతులకు అంకితంచేస్తున్నందుకు, కృతకర్త, కృత స్వీకర్తలుధన్యులు

ఈ 'జీవన శ్రుతులు' - నిజ జీవిత స
స్మంగళ హృదయంగమ చిత్
శృంగసరద్గాంగవీచి జీవన శ్రుతులే!
వాటిని మీ స్వంతం చేసుకొండి హృదయంలో భద్రపరచకొండి

**- ఆచార్య తిరుమల**

# ఆత్మశ్రుతి

ఈ "జీవనశ్రుతులు" నా కవితాత్మస్పందనలకు అక్షరాకృతులు అలవోకగా వ్రాసినవే అయినా, నా సుదీర్ఘ జీవితానుభూతుల, అనుభవాల సారభూతంగా నిలుస్తాయని ఆశిస్తున్నాను నాకు అన్ని కవితా ప్రక్రియల పట్ల గౌరవభావం ఉంది అన్నీ నాకు ఇష్టమైనవే అయితే పద్యరూపంలో చెప్పె భావసత్యాలు, భౌతిక వాస్తవాలు ఛందో

పాటకన్నా, కావ్య వచనం కన్నా పద్యానికి సంప్రదాయ బద్ధమైన, ధారణానుకూల నిబద్ధమైన శైలి శిల్ప శబ్ద సౌందర్యాలను సంతరించుకున్నది అందుకే అది వేయేళ్ల చరిత్రను వెంట తీసుకొని, హద్దులేని భవిష్యత్తులోకి ముద్దుగా సాగిపోతున్నది ఇదంతా ఎందుకు వల్లిస్తున్నానంటే నా "హృదయపద్యం" లాగే ఈజీవినశ్రుతులు కూడా ప్రజాదరణ రసజ్ఞుల మన్నన పొందగలవని మనవి చేయటానికే వర్ధమాన యువకవులు ఇతర ప్రక్రియలతోపాటు పద్యాన్ని కూడా సాధన చేసి ఆధునికి తెలుగు కవితా రంగాన్ని మరింత సస్యశ్యామలం చేయాలని సూచించటానికే "పద్యానికి ప్రమాదం" లేదని పదే పదే ఉద్ఘాటించడానికే

విమర్శనా విశ్వరూపుడు కవితాత్మజ్ఞుడు ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం గారు తీర్చిన "ముత్యాలసరం" ఆత్మీయులు కవికౌస్తుభ ఆచార్య తిరుల వేసిన 'స్వరపీఠి' ఈ కృతి ఆత్మావిష్కరణ చేసినవి నేనంతకంటే సహృదయులైన పాఠకులకు చెప్పవలసిందేమీ లేదు వారికి నా ధన్యవాదాలు

ఈ గ్రంధాన్ని అత్యంత ఆదరాభిమానలతో అంకితం తీసుకోవటానికి అంగీకరించినందుకు ఆత్మీయులు, సంస్కృతీ సంపన్నులు శ్రీ రామకృష్ణ గారికి ఆయన ధర్మపత్ని శ్రీమతి కళగారికి నేనెంతో కృతజ్ఞున్ని

పూజ్యు సాహిత్య జీవితయాత్రలో నన్ను నిరంతరం ప్రోత్సహిస్తున్నందుకు వారికి సర్వదా కృతజ్ఞుణ్ణి నన్ను వెన్నుతట్టుతున్న

మిత్రులు, శ్రేయోభిలాషులు, అభిమానులు దేశవిదేశాలలో ఎందరో! వారందరికీ వందనాలు ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం, డా గుంటూరు శేషేంద్ర శర్మ, డా నగభైరవకోటేశ్వర రావు, డా యం ఎస్ రెడ్డి, డా ఉండెల మాలకొండారెడ్డి ఆచార్య
ఆచార్య ఎస్ అమీరుద్దీన్ డా ఎ పద్మనాభం,
డా కృష్ణ శ్రీనివాస్, ఆచార్య
శ్రీ వల్లూరి రాఘవ రావు, డా వి కొండల రావు, డా యం శంకరరెడ్డి వంటి సాహితీబంధువులందరికి ఈ సందర్భంలో ప్రేమాంజలిఘటిస్తున్నాను శ్రీయుతులు పి సుదర్శన్ రెడ్డి, జి ఎస్ ప్రకాశరావు, ఎ వి ఎస్ రాజు, సారిపల్లి కొండలరావు, ఎస్ రాధాస్వామి, బి జయరామన్, పి ఆర్ కృష్ణారెడ్డి, బి రామలింగరాజు, డి ఆదికేశవులు, డి విరలరావు, కె ఎస్ రెడ్డి, డి వి ఎస్ రాజు, అట్లూరి సుబ్బారావు, యం చిత్తరంజన్ వంటి సాహితీ పోషకులను నేను ఈ సందర్భంలో కృతజ్ఞతా పూర్వకంగా తలచుకుంటున్నాను

నేను కలిగించే ఇబ్బందులన్నీ ఓర్చుకుని ... ్మతిస్తున్న నా జీవితేశ్వరి రాజేశ్వరికి, నా శుభాభినందనలు నా కుటుంబసభ్యులు శాంతి ప్రియ-మారుతి, రాధిక బాలాజీ, జయశ్రీ-మహేందర్ రెడ్డి, వారితోపాటు నా పౌత్రులు, దౌహిత్రులు దేవి, సాయికృష్ణ, యశ్వంత్, రసిక్, తన్వి చిరంజీవులను నేను ఆశీర్వదిస్తూ, పులకిస్తున్నాను

ఈ పుస్తకాన్ని సర్వాంగ సుందరంగా ప్రచురించడానికి, ఆవిష్కరించడానికి దోహదం చేసిన యువకళావాహిని వారికి ముఖ్యంగా శ్రీ వై కె నాగేశ్వరరావు గారికి నా ప్రశంసాపూర్వక కృతజ్ఞతలు ముచ్చటగా ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్‌కు నా ప్రత్యేక అభినందనలు

**జె బాపురెడ్డి**

# ఇందు . . .

# జీవన శ్రుతులు

విజయము కన్నుల వెలుగై
సృజనాత్మక భావలక్ష్మి చేతనమై, భా
వజుడే కంగారుపడే
రజతాచల శోభమీరు రమణిన్ కంటిన్ !

2

మందస్మితమును మధువును
కుందములను సౌరభముల కూర్చిన మోవిన్
అందించే నామె, ఇదియే
అందమునకు నిర్వచనము అనినట్లుగనే !

3

చదివితి కావ్యాలెన్నో
చదివితి విజ్ఞాన ప్రకృతి శాస్త్రాలెన్నో
చదివితి మతహిత బోధలు
చదువగలే నైతి ఆమె సంజ్ఞల భాషన్

4

సుఖ దు ఖమ్ములు రెండును
సఖులే, జీవిత స్రవంతి సారధి తటులే
లిఖియింతు రిద్దరును, అభి
ముఖులై తమ హక్కు భుక్తముల పత్రమ్ముల్

**5**

సింగిణి రంగులు కావివి
నింగికి నిచ్చెనలు కావు, నిజ జీవిత స
న్మంగళ హృదయం గమ చిత్
శృంగసరద్గాంగ వీచి జీవన శ్రుతులే!

**6**

భావవనమ్ముల, అక్షయ
జీవన రాగముల కూర్చి, శివ సుందర స
త్యా విష్కరణము చేసెడి
గోవిందుడు నా చిదాత్మ ఘోషకుడయ్యోన్

**7**

అందము ఛందము, స్పందన
సందేశము స్వానుభూతి సరసత లేకన్
చిందులు వేసిన కవితలు
పెందలకడ కాటికి శవపేటికలయ్యెన్ !

**8**

మోదమునకు ఖేదమునకు
భేదములేదనెడి వేద వేదాంతజ్ఞుల్
కాదనక వారి సంపద
పేదల కిడ గలరె గొప్ప పేరున కైనక్ !

బాపూ

## 9

భువిపై పడవేసి వెడలిపోయెనెటేకొ ! మా
నవ జీవిత విపణిని, నా
వ్యవహారము చూచి పోవ వచ్చెను మరలన్

## 10

పుడమి బడిలోన ఆడే
కడలితరంగాలు మబ్బుగములై నింగిన్
నడయాడ బోయి, శూన్యపు
టడవిదియని తిరిగివచ్చు, అవనిని కొలువన్ !

## 11

అంబరము క్రింది, నరలో
కంబును స్వర్గంబు చేయగల సుందర స
త్యంబులు చెప్పెదనని, మూ
ర్ఖంబుగ డంబములు చెప్ప కవినేమందున్ !

## 12

నన్నయ తిక్కన్నయు, పో
తన్నయు శ్రీనాథ పెద్దనాదిక వీంద్రుల్
ఎన్నగ వర కవులగు, వే
మన్నల కనిపెంచిన రసమయి పద్యమ్మే !

13

సంతోషము, పరితోషము
దాంతము, శాంతము, జిగీష, త్యాగ గుణమ్ముల్
క్రాంతికి శుభ షడ్వర్గము
స్వాంతములో దీని నిల్పు జనుడే ఘనుడౌ !

14

పసిపిల్లలతో ఆడెడి
ముసలితనము తిరిగి బాల్యమును పొందిన టుల్
కుసు మించును, మసనముపై
కసరుచు, జీవితపు పూలకారును చేరున్ !

15

నిదురించెడి కాయములో
నిదురించని ఆత్మ గోస్తనీ నవనవా
రదముల తేలుచు వచ్చెడి
ఉదయమ్మట శిశువులవని ఉదయించెదరో !

16

ఈ భావ వనములందున
ప్రాభాత సమీరమట్లు పాడెడు నను రా
శీభూత సౌరభజ్వా
లాభామిని వోలె కాల్చు రాగిణి ఎవరో !

## 17

జై కొట్టిన భయ పెట్టిన
లౌకిక సంపదల నెన్ని లంచ మ్మిడినన్
చేకొని విడువక, ప్రాణము
చేకొనియే పోవు కార్య శీలి "మరణ' మే !

## 18

మనమునగల భావనలకు
ఘన తరమగు వాస్తు రూపకల్పన చేతున్
కనుపించు వస్తువులలో
కనుపించని భావ సత్య కాంతులు నింతున్

## 19

ఎరుగని సత్యమ్ములు, నీ
వెరిగిన యట్లురిమి ఒరుల హింసించకుమా !
జ్వర పీడితులకు మందని
గరళమ్మిడి చంపబోకు గర్వాంధుడవై !

## 20

జపముల తపముల నెపమున
కపట కుటిల సంకటకర, కామాంధులకే
అపురూప శక్తు లిచ్చుట
అపరాధమె, ఇడిన వారు హరి హరులైనన్ !

## 21

ప్రవిమల గుణ సాగరుడును
నవ కవితా పద్య పద్మనాభుడును, ప్రజా
కవిశబ్ద రసాకృతుడును
ఎవరన ? శివసత్య భావుడే, జాషువమే !

## 22

మరుపు అను గుణము తొలగిన
చెరగని స్మృతులన్ని నరుని చీల్చున్ కాల్చున్
వెరపు అను గుణము తొలగిన
నరులను మృత్యువు సయితము నతులిడి కొల్చున్ !

## 23

భావాలకు శబ్దమ్ములు
త్రోవలుగా నొదుగవలయు, దొరలెడు మాటల్
భావాలె తమకు లొంగుచు
పోవాలను కొనిన చచ్చిపోవును కవితల్ !

## 24

మగువను మందర చేసిన
మగవారికి బుద్ధి చెప్ప మందర పాత్రే
అగు పించని రామాయణ
నిగమము సృష్టించె మొల్ల నిర్మల దృష్టిన్

## 25

మాసమ్ములన్నియును, మధు
మాసములై వచ్చెనేని మధు కంఠాలా
పాసవము కర్ణ విచ్ఛే
దాసుర రణ ఘోషహేష లైపోవునులే ।

## 26

జీవితమున పురుషుల యెడ
పావనమౌ ప్రేమ కొంత భాగమ్మెయగున్
భావించ ప్రేమ స్త్రీలకు
జీవిత సర్వస్వ మని వచించిరి పెద్దల్ ।

## 27

చెట్టు చెవిలోన పక్షులు
గుట్టుగ గుసగుసలు చెప్ప గోప్యము లేవో
అట్టిటు తలలూపును, ఆ
చెట్టు, సరే యనుచు బదులు చెప్పిన రీతిన్ ।

## 28

కలలోన నేను దేవుడు
కలిసికొని ఒకరి వొకరము కష్టసుఖమ్ముల్
తెలిసికొన భువిసమస్యలు
కలనైనను తీర్చవశము కాదని తోచెన్ ।

**29**

అంధా వేశత, వీచిక
సింధువు విడి లేచిపోయె చిందులు త్రొక్కె
గంధవ వాలు తోడ, జీవన
బంధము తెగిపోయి గాలిపటమై పోయెన్ ।

**30**

ఛంచోబద్ధతగల కవి
ఛాంచసుడని ఈ సడించి చదువకయే ఏ
అందము చందము పద్యము
లందున లేదనుట వెర్రి యాటయె కాదా ।

**31**

ఉన్నాడను వాడును లే
డన్నా! అనువాడును ఇటునటు ఎటు గాకన్
ఉన్నాడొ లేడొ అను వా
డెన్నగ ముగ్గురును మూర్ఖులెవరికి వారే ।

**32**

చెడుచేయుటిష్టమైనను
చెడుపేరిష్టమ్ము గాదు చెప్పిరి పెద్దల్
కడలేని తెలివి యుండిన
చెడుపేరే రాని చెడును చేయుట తరమే ।

## 33

భూ లోకము సత్యమని, మ
రే లోకము చూడని ఘటకేశ్వరులనుటల్
నీలాకాశము నిజమని
గాలిని విడనాడి పక్షి గల్లంతవుటే!

## 34

మితిలేని తాపమును స
మ్మతితోడ భరించి విశ్వమంతటికి సదా
అతులిత కాంతిని పంచు స
విత నారాధించుటే వివేక మన బడున్

## 35

పెరుగనిచో తరుగును చం
దురిని వలెన్ ప్రేమగూడ, తోరముగా ఈ
నరులెల్ల కష్ట సుఖములు
వరములుగా నెంచుకొనిన వర్ధిలు ప్రేమల్!

## 36

అడుగు కొను ప్రేమ కంటెను
అడుగక లభియించు ప్రేమ అతులితమౌ నీ
వడుగక యిడు నీ ప్రేమను
అడుగని వారికిని ఇష్టమైనను నీకున్

## 37

వేగములన్నిటి కన్నను
భూగణితము, కాంతివేగమును మిన్న యనున్
ఏ గుణితమునకు చిక్కక
సాగెడు కాలమ్ము తానె శాసించు తనన్

## 38

ఈ లోకమ్మును కాదని
ఏ లోకమ్మునకు నీవు ఏగిన అచటన్
నీ లాగుననే ఏగిన
భూలోకుల చెంత బ్రతుకు పునరావృతమౌ !

## 39

ఎందుకు జీవించెదవో
ముందుగ నీ వెరుగ వలయు, మున్ముందర, యే
సందియముండదు నీవే
చందముగా నైన బ్రతుకు చక్రముత్రిప్పన్ !

## 40

కోటాను కోట్ల చుక్కలు
మాటాడెడి భాష ఏదో ? మౌన మెరుగునో !
మాటాడగలదొ మౌనము
మాటల మౌనమ్మొ అనంతమను భావమ్మో !

### 41

చేరగలేని దిగంతము
చేరగపరుగిడి నిరాశ చెందుట కంటెన్
కోరి నిను చేరవచ్చు స
మీరములో ఆత్మ తృప్తి మృగమదమైపో!

### 42

ఛందములందున కందాల్
కందర్ప శృంఖలములగు, కవితలలో, మా
కందరస కందళితములు
అందుకె ఊరించు నన్ను, అవి, చిత్రముగా !

### 43

ఉత్తరమురాని రోజున
తత్తర పడిపోవు తాత తా బ్రతిక నటుక్
ఉత్తరము వచ్చినపుడే
చిత్తమునకు నమ్మకమ్ము చేకూరుటచే !

### 44

దోదూయ మాన మానస
చోదితమై జీవితమ్ము చొచ్చెను, బాధా
వేచనలను, నా మానుష
కేదారములందు గావు కేకలు పండెన్ !

## 45

ఓ యే బది ' సామాన్యులు"
చేయు పనిని యంత్ర మొకటి చేయం జాలున్
చేయునొక "అసామాన్యుడు
ఏ యంత్రము చేయ లేని ఎన లేని పనుల్ !

## 46

నేరమునకు పడు శిక్షకు
కారణమేదైన మనిషి కరమలు మోడ్చున్
ఊరక పడు శిక్షను, స్వీ
కారమ్మొ నరింపగల్గు కన్నీరొకటే!

## 47

శత్రువుల నెదుర్కొనుటకు
క్షాత్రముగల సాధనములు కలవెన్నెన్నో
మిత్రద్రోహము నోర్చెడి
పాత్రత గల దొక్క దు ఖ బాష్పమ్ములకే !

## 48

కళ్ళేమొ కోహి నూరులు,
పళ్లేమో లేగులాబి పాటల మల్లెల్
అల్లారు ముద్దు గుమ్మకు
ఒల్లంతా కవితలల్లు ఒయ్యారములే !

## 49

ఛందము నా నాలుక పై
సుందర నాట్యమ్ము చేయు సురుచిరముగ, నా
డెందము నవకందములై
చిందును స్వచ్ఛంద భావ చేతన రుతులన్

## 50

తమిదీర మధువు గ్రోలుచు
రమణీమణి 'సాఖి' కనులరాగాకృతియై
కమనీయ కవితలల్లిన
అమర కవీంద్రుడు ఉమరఖయామీ భువిలో !

## 51

ప్రజలే రాజులు నే డది
నిజమే, వారేలు భూమి నిప్పచ్చరమే
ధ్వజమో తీరని కోర్కెలు
నిజవాసము కలల 'కాలనీల' పురమ్ముల్ !

## 52

పద్దెములల్లు కవీంద్రుడు
ఒద్దికగా దైవభక్తి యుత సంహితుడై
సుద్దులు చెప్పు "ఫణీంద్రు"డు
ముద్దుల గుమ్మలను చూచి ముద్దై పోవున్!

53

పంచేంద్రియముల, తక్కువ
అంచన వేయకుము దేనినైనన్, ఆత్మో
దంచిత వాంఛలు తీర్చెడి
సంచిత సాధనములవియె, సకలావనిలో !

54

మగవారికన్న మగువలు
సుగుణమ్ములలోన రూప శోభలయందున్
తగువారను సత్యమ్మును,
తెగ చాటిన వీరమొల్ల ధీమణికి నతుల్ !

55

శ్రమయే సృష్టికి ప్రాణము
శ్రమయే పరిణామ చరిత రథసారథియున్
శ్రమ సమ్మెకు దిగెనో కా
లమె ప్రాణాపాయశృంఖలములన్ చిక్కున్ !

56

పద్యత్పజ్జితములు, వా
పద్యమ్ములు, వావివెంట పడం భావమ్ముల్
హృద్యములాద్యంతము రస
విద్యలకే విద్యయైన విద్య కవితయే !

బాపూ

## 57

పతి తల్లి రామలక్ష్మి, హ
సితయౌ సతి తల్లిపేరు చిలకమ్మ గుటక్
పతి, సతి మాతల పేరుల
స్మృతితో వారిల్లు "రామచిలుక" న బడియెన్ !

## 58

చినవాడు తాను వడి ది
ద్దిన అ-ఆ లనుభవైక ధీదీప్తుల వె
ల్గెను, అక్కినేని ఆలో
చనలై విజ్ఞాన సూక్తి ఝురులై విరులై !

## 59

"పల్లవి" దొరికిన దని నే
నుల్లము ఉప్పొంగ దాని నూరించితి, ని
న్నొల్లను పోయని పోయెను
పల్లివితో పాటు వలపు పాటయు బోయెన్

## 60

ఇరు ప్రక్కల లఘువులతో
అరుదెంచెడి గురువు జగణమై, హుందాగా
సరియైన స్థానముననే
పరిణిష్టుండగును కంద పద్యము నందున్ !

## 61

కులమత మౌఢ్యమ్ములపై
కలమెత్తిన మానవత్వ గళమెత్తిన కో
కిల సింహనాద కవితో
జ్వల మూర్తికి జాషువాకు ప్రణుతి శతమ్ముల్ !

## 62

చినవాడు బాల కృష్ణుడు
నెన రాలొకడు యౌ వనమున నేమో, బృందా
వన కృష్ణుడు, గీతా బో
ధన కృష్ణుండిపుడు నాకు దైవంబయ్యెన్ !

## 63

కోతికి బ్రాందీ ఇచ్చిన
గీతా పరనమ్ము కాదు గిరగిర తిరుగున్
ప్రీతిగ మధువును కోకిల
యే తాగిన పాటపాడు, ఏ ఋతువైనన్ !

## 64

నభమను గడియారములో
ప్రభలీవెడి సూర్య చంద్ర వరకర యుగముల్
ఉభయత కొలుచుచు, చూపు ను
లభరీతిని కాలగతిని రాత్రింబవళుల్

## 65

కలదందురు ధనికుల ఎడ
కలదందురు పేదవారి కరకమలములన్
కలదట గజ దొంగల యెడ
కలదను అధికార మసలు కలదో లేదో !

*(పోతనకు చేతులెత్తి)*

## 66

కలదందురు కలలందున
కలదందురు వాస్తవాలు కనుకనులందున్
కలదట వలదను వారికి
కలదను ఆనంద మసలు కలయో ! నిజమో !

*(పోతనకు చేతులెత్తి)*

## 67

అక్కరకు రాని నీతులు
గుక్క తిరగకుండ కక్కు కూతల్ రాతల్
ఎక్కడ నిక్కిన నీల్గిన
గ్రక్కున వెలివేయ వలయు గదరా బాపూ !

*(సుమతి శతక కారుని స్ఫూర్తితో)*

## 68

కలలో దొరకని దుండదు
తల లోపలి తలపులాత్మ దఘ్నంబైనన్
కలలో కన్నవి విన్నవి
ఇలలో నిజమైతె, బ్రతుకుటే కలయేమో !

**69**

చప్పున వచ్చును కవితలు
చప్పుడు కాకుండ గుండె చప్పుడు నుండే
అప్పటి కప్పుడె వాటిని
తప్పొప్పులు దిద్ది కాగితములద్దు కొనున్

**70**

తల్లివి నీవే నా హృ
ద్వల్లివి నీ వేను వాణి ! వర కవితలు నా
విల్లమ్ములుగా గొని ఘా
ఢిల్లెడి చీకటి గణాల వెల్ల జయంతున్

**71**

మైఖేల్ మధు మాదన దత్
[illegible]ములన్ని కలుప బూనిన కవితా
[illegible] గీసిన అక్షర
రేఖా చిత్రమున కంజలించెద భక్తిక్ !

**72**

[illegible] గాయము
[illegible], [illegible]

[illegible]

## 73

జండాలు మార్చుకొనిన ఎ
జండా అదియేను "స్వార్థ సముపార్జన' ముల్
గుండాల అండ యుండగ
గండాలే లేవు నాయక మ్మన్యులకున్ !

## 74

నాటైన "సార ' అయినను
నీటైన స్కాచి అయిన నెర ద్రాగినచో
మేటి వివేకుల నైనను
మాట వినక చేటుచేయు, మత్తొకటేరా !

## 75

ఊరింపుల కని ఇడుముల
కారడవుల చిక్కి నరులు కటకట పడుటల్
తారకలనుకొని దీప శి
ఖారుణిమన్ దూకి శలభ మాహుతి యౌటే !

## 76

వాదాల రైలు బండికి
వాదమ్మేదైన బోగి వలెనే తగులున్
నీ దేదొ చూచి ఎక్కుము
ఏ దైనను గమ్య మొకటియే ! మానవతే !

**77**

మంటలు ఆకలి హెచ్చిన
మంటలు కోపము మరిమరి హెచ్చన్
మంటలు స్వార్థము హెచ్చిన
మంటలుగా మారు తీవ్ర మైనది యెల్లన్ !

**78**

ముత్యాల వంటి పద్యాల్
సత్యాలను మణులతోడ శారద మెడలో
స్తుత్య స్వరహారములై
నిత్యానందమ్ము గూర్చు నిఖిలావనికిన్

**79**

ఔనను రెండక్షరములు
మానిని ప్రకటించుదాక మౌన నిరీక్షన్
పూని చెలిపేరునే తన
ల్ల పరియించె నహెూ

**80**

సూర్యుని కాంతిన దోచెడి
చౌర్య కళా వైభవములు చంద్రుని వైతే
ఆర్యుని, సిరిగుట్టెరిగిన
సూర్యుని విభవము పరాయి సొమ్మేనేమో !

## 81

నింగికి రంగులు తీర్చెడి
సింగణులను దోచుకున్న సిద్ధుడ, కానే
దొంగను, శిక్షా స్మృతులకు
లొంగని నేరమ్ము నాది లోక ప్రియుడన్ !

## 82

ప్రేమంటె ఏమిటో యని
నా, మానసమెంత తరచినన్ తెలియనెడన్
నీ మోము మీద విరిసిన
ఆమని నే నౌట చూడ అవగతమయ్యెన్ !

## 83

పురజనులో, గిరిజనులో
కొరకొరమను దళితజనుల కులమేదైనన్
సరిలేని కలిమి కూడిన
సిరిజనులకె చెందు సకల జీవిత సుఖముల్ !

## 84

అవినీతి అప్సరసలై
నవ నాట్యములాడి ధూర్త నాయక వరులన్
దివిజేంద్రనిభులచే సిన
భువి, స్వర్గముగాక కర్మభూమెటు లౌనో !

## 85

ప్రాచీన మైన దియు అ
ర్వా చీనమ్మైన దియు, సమాదరణీయ
మ్మే ! చైతన్యా భ్యుదయ స
మీచీనమ్మైన దేని, మేదిని కెల్లన్ !

## 86

ముక్కంటి కంటి మంటల
చిక్కి నశించియును మరల జీవించిన వా
డొక్కడె టక్కరి మదనుడు
అక్కట ! అతని ని జయించుటన్నది మిధ్యే !

## 87

చోరుడని తెలిసి కూడా
దారిన పోయేటి వారి దరి చేరి, నమ
స్కార మిడి సరసమాడుట
కోరుకొని కొరివి గొని తలగోకు కొనుటయే !

## 88

చీకటి యే వెలుతురు పై
చే కూరిన విజయమునకు చేసి కొనెడి, మా
యా కాంతి పర్వ శోభా
నీకము, దీపావళి అవినీతి పురాలన్

## 89

చిక్కిన నా ఒంటిని, చిరు
ముక్కలు చేయండి కాని ముక్తేశ్వరి నా
చక్కని ప్రేయసి నొక తరి
ఇక్కడ కనినంత తీయు డీ నా కన్నుల్ !

## 90

ప్రోద్యచ్ఛద్రత్నస్థగి
తద్యో ఛత్రము కనుచు సదా శశి నిశలున్
అదృశ్యీన ప్రభాత స
ముద్యోతము చూచి వెడలి పోయెదరెటకో !

## 91

నేలను విషసర్పమ్ములు
గాలిని రాబందులు, పెను కడలుల మకరుల్
పోలెడి, క్రూరులు, కూళలు
ఏలెడి భువిలోన న్యాయ మెట్లు బ్రతుకునో !

## 92

కులమత కుట్రల వలలో
తెలయక పడిపోయి ఘోర తిమిరాంధక, హ
త్యల రాజకీయములకే
బలియ య్యెడి దేశమాత భవితమ్మెమో !

**93**

వృద్ధుడ వగుచున్న కొలది
బద్ధకమును వీడి చేయవలె నీ పనులన్
సిద్ధపడి త్వరితముగ, నీ
వద్ద గల సమయము తక్కు వగుచుండుటచే !

**94**

పాలనుకొన్నవి విషమై
గాలను కొన్నవి అపాయ కరకల్మషమై
జాలను కొన్నది మృషయై
తూలెడి లోకమున దిక్కు తోచక యుంటిన్ !

**95**

అలనాడు సుధాముని అటు
కులకే పులకించినాడు గోవిందుండే
కలవారు నేడు పేదల
చెలిమికి చలియించిరేని శ్రేయస్కరమౌ !

**96**

వరసత్య భామ కృష్ణుని
శిరమును తన కాల తన్నె చిత్రము కాదా !
పరమాత్మ కన్న మిన్నగ
వరియించెను పారిజాత ప్రసవమ్ములనే !

## 97

సృజనాత్మలనెడి కవులే
భజనాత్మకు లౌట ఆత్మ వంచన కాదా !
అజురాణి కన్న మిన్నగ
'నజరానుల కొలుచువారి న్యాయమ్మేచో !

## 98

హంతుకులెవరో తన శు
ద్ధాంతములో ఆప్తులెవరొ అగుపించనిదు
ర్ధ్వాంతములో మునుగుచు నే
డెంతయు చింతించు భారతాంబిక అకటా !

## 99

రెక్కలు వచ్చిన పక్షులు
చిక్కవు చేతికి స్వతంత్ర జీవన మతులై
దిక్కుల కెగ బ్రాకును సమ
దృక్కుల వలె సత్య భావ ధీధితులట్లున్

## 100

ఒక పాల కోవ గోవా
సికతాతల భేలనా ర సికతే గోవా !
శుక పిక గానము గోవా
సకల మతాతీత ఇంద్రచాపము గోవా !

## 101

అందాలు ఎన్ని చూసిన
డెందాలకు తృప్తి లేదు డెక్కాను కోర్కెల్
ఎందుకు? అను చిరు ప్రశ్నకు
వందన మిడు చేతు లెత్తి, వాదములెల్లన్

## 102

నిప్పుకు చెదలంటినచో
చప్పున జలమందు చిచ్చు జ్వాలలెగసినన్
ఎప్పు గిది లోకముండునొ?
చెప్పెడి వారెవ్వరైన చేతులు మోడ్తున్ !

## 103

పైరూపము కెమెరాలో
లో రూపము  ఎక్సరేలలో చూచినటుల్
ఈ రెండి తత్వములు, కను
వారే పత్కవులు  ఋషులు, పరిపూర్ణాత్ముల్ !

## 104

తోటబడిలోన పక్షులు
పాటలు నేర్చుకొని, రాగ వాసంతములో
పోటి పడి పాడె, కోకిల
పాటలకే దక్కె ప్రథమ బహుమతులెల్లన్

## 105

నిస్తుల జవసత్వాలు, గ
భస్తి కనీనికలు సృజన భావ ద్యుతులే
అస్తులు గల పద్యావతి
దుస్తుల పహరింపలేరు దుశ్శాసనులున్

## 106

పాషాణమ్ములు ఎరుగని
భాషలు భావములు లేవు, పరిణామ పథా
న్వేషికి అవియే సత్ చి
ద్భోషాణము లభ్యుదయ ప్రబోధాత్మకులౌ !

## 107

ఏరకు మీ ఏ కాయలు
దూరక మీ శత్రు జనుల దోషంబైనన్
పారకు మీ మోసమ్ముల
మీరకు మీ మూర్ఖ లాజ్ఞ। మేలగు నీకే !

*(సుమతి శతక కారునికి చేతులెత్తి)*

## 108

కూళల, స్వార్థో న్మాదుల
లీలలు నెదిరించి గెలువలేని శిశువునై
నాలో నేనే వెలిగితి
కాలము నను తాక లేక కరములు మోడ్చెన్ !

## 109

భూ స్వామ్య, ధనస్వామ్య బ
లస్వామ్యములేను కాక రహిలో గల ఏ
ఏ స్వామ్యమైన బెదరు భ
యస్వామ్యము ఆవరించె అఖిలావనిలో

## 110

అగ్ర హణ స్థితియును, అన
ధగ్రహణ స్థితిని దాటి ద్వైతా ద్వైతా
ను గ్రహ రూపము లెరిగి చి
ద గ్రమ్మగు శుద్ధ చేత నాత్ముడు వైపో !

## 111

కల్లాకపటము లెరుగని
పిల్లలతో కల్లలాడి వేడుక పడుటల్
చెల్లదు! ఆ కల్లలు సిరి
మల్లెలగును రాజకీయ మల్లుడవైపో !

## 112

సద్రూపమేమొ సత్యము
చిద్రూపము జ్ఞానము  అవి చింతనలో ని
ర్నిద్రత వెలిగిన నాడే
భద్రత మానవుల బుడుత బ్రతుకుల కెల్లన్ !

బాపురె

## 113

కుండజలములో కన్పడు
చుండెడి ఆకాశమట్లు చోద్యమ్ముగ, బ్ర
హ్మాండపు ప్రతి రూపమె జీ
వుండని గుర్తించు ! బ్రతుకు పూర్ణత చెందున్

## 114

నను ప్రేమించిన మిత్రుల
నను ద్వేషించిన జనమ్ము నైనను, సమద
ర్శనమున ప్రేమించితి, ఈ
గుణమిట్లే వరలుచుంట కోరుచునుందున్

## 115

సూత్రముల కామ సూత్ర ప
విత్రత, వాత్స్యాయనముని వెలిచించెను, ఈ
ధాత్రిని, సృజనార్తికి ఆ
రాత్రికముగ, రాగభోగ రసయోగమునన్

## 116

ఏదో శోధించాలని
కాదో ఔనో వివాదగతతర్కముతో
ఏదో భోదించగలని
ర్వేదాటవి తిరుగునొకవీశ్వరుగంటిన్

### 117

జనుషాంధువైన, కలలను
కనునో? కనెనేని ఏమికనునో యను, చిం
తన గల నను, కలలో ఒక
జనుషాంధువు గుర్తు పట్టి సంభాషించెన్

### 118

గౌరవము ప్రేమ మూలము
కారణములు చెప్పలేని కార్యము, లోకా
ధారము ప్రేమయె, జీవిత
సారము మన నిత్య సత్య సహజీవనమే !

### 119

నెల్లూరు మండలమ్మున
పల్లియ చిరునవ్వులోన ప్రభవించియు, సం
పుల్లాత్మ చేతనత, వ
ర్ధిల్లిన దువ్వూరి రామిరెడ్డికి జేజే !

### 120

చూచితి సౌందర్యమ్ములు
చూచితి మధురుచులు, తాకి చూచితి కౌనుల్
చూచితి నవవాసన, విని
చోద్యములెన్నో

## 121

వయసుకులొంగని తనువును
భయపెట్టెడి కాలమునకు వంగని మనసున్
క్షయకారక శక్తుల, ధై
ర్యముతో ఎదురించి పొందు మనె చోప్రాజీ ।

## 122

కలకత్తా నగరములో
కలలెన్నో వాస్తవాల కన్నీరై పే
దలవేదనలకు, ఓదా
ర్పులు చెప్పగ లేక మూర్ఛ పోవుట గంటిన్

## 123

సంకుచితత్వము, స్వార్థము
పంకిల మౌరాజకీయ పన్నాగమ్ముల్
రంకులు, వ్యాపార కళల్
బొంగులు మానేటి మనిషి పుట్టేదెపుడో

## 124

చలిబాధ అందులో, నె
చ్చెలి లేనివియోగ బాధ శీతలమ్మౌ
వ్నెల బాధ యౌవనతిమిం
గిల కోలా హలము, బ్రతుకు

## 117

జనుషాంధువైన, కలలను
కనునో? కనెనేని ఏమికనునో యను, చిం
తన గల నను, కలలో ఒక
జనుషాంధువు గుర్తు పట్టి సంభాషించెన్

## 118

గౌరవము ప్రేమ మూలము
కారణములు చెప్పలేని కార్యము, లోకా
ధారము ప్రేమయె, జీవిత
సారము మన నిత్య సత్య సహజీవనమే !

## 119

నెల్లూరు మండలమ్మున
పల్లియ చిరునవ్వులోన ప్రభవించియు సం
పుల్లాత్మ చేతనత, వ
ర్ధిల్లిన దువ్వూరి రామిరెడ్డికి జేజే !

## 120

చూచితి సౌందర్యమ్ములు
చూచితి మధురుచులు, తాకి చూచితి కౌనుల్
చూచితి నవవాసన, విని
చూచితి జీవనశ్రుతులను, చోద్యములెన్నో

బాపు

## 121

వయసుకులొంగని తనువును
భయపెట్టెడి కాలమునకు వంగని మనసున్
క్షయకారక శక్తుల, ధై
ర్యముతో ఎదురించి పొందు మనె చోప్రాజీ ।

## 122

కలకత్తా నగరములో
కలలెన్నో వాస్తవాల కన్నీరై, పే
దలవేదనలకు, ఓదా
ర్పులు చెప్పగ లేక మూర్ఛ పోవుట గంటిన్

## 123

సంకుచితత్వము, స్వార్థము
పంకిల మౌరాజకీయ పన్నాగమ్ముల్
రంకులు, వ్యాపార కళల్
బొంగులు మానేటి మనిషి పుట్టేదెపుడో

## 124

చలిబాధ అందులో, నె
చ్చెలి లేనివియోగ బాధ శీతలమౌ, వె
న్నెల బాధ యౌవనతిమిం
గిల కోలా హలము, బ్రతుకు గిజ గిజలాడెన్

## 125

నియమనిబంధనలన్నీ
భయభక్తులు ఉన్న పేద ప్రజలకె కానీ
నయవంచనతో మనుషుల
క్రయవిక్రయ మాచరించు ఘుకులకు కాదోయ్ ।

## 126

వరకట్నముతేలేదని
కొరకొర వేధించబడ్డ కోడళ్లకు, ఏ
ఉరితాడొ, కిరసనాయిలొ
వరములుగా వచ్చి తీర్చు పరితాపములన్

## 127

తెలియక తప్పులు చేసిన
తెలుపుట సాధ్యమ్ముకాని, తెలిసితెలిసియే
తెలిసిన తప్పులు చేసెడి
తెలివికి తెలిపేది చావు దెబ్బ ఒకటియే ।

## 128

ఏ పథకం చేపట్టిన
పాపాత్ములు కలిసిదొంగ పనులకు లోనై
దోపిడి చేయుచు ఉంటే
ఏ పగదే జన్మభూమి వృద్ధికి వచ్చున్ ?

## 129

తాడును పామని భ్రమపడి
వీడకు మీ ప్రాణములను, విశ్వాసముతో
తాడును చేయుచు పామునె
పోడిమితో బ్రతికిపొమ్ము, పురుషార్థమిదే !

## 130

వాన ప్రస్థా శ్రమమున
ప్రాణేశ్వరి మీద మోజుపడి, ఒకడాత్మ
జ్ఞానేశ్వరిని త్యజించి, ప్ర
జానాయకుడయ్యె మరల జంబూద్వీపే !

## 131

అద్వయుడను, నిర్భయుడను
అద్వైతానంద గీతి కాలాపకుడన్
విద్వన్మణులందరు హృ
చ్ఛాద్వలముల పరచకున్న సంస్కృతి నేనే !

## 132

వరుడో వధువో, ఉభయులొ
పరదేశనివాసులైన భారతీయులై
పరిణయమాడుట "కంప్యూ
టరి", పారాయణి దయాకటాక్షము కలనే !

## 133

వరకట్న వరుని కంటెను
తిరుపములన్ తిరుపమైన ద్రిమ్మరి మే లౌ
కొర కొరల 'దొరల' కాదని
వరియింపుము ప్రేమధర్మవర్తన వళగున్

## 134

ముసలినయి "చితికి ' చనునను
పసిపాపల "ముద్దు" లన్ని పారవశతలై
కుసుమింపజేయు నాలో
పసితనమును మరల ఆట పాటల స్మృతులై

## 135

ఈ లోకమ్మును మించిన
దే లోకము లేదటంచు ఎంచుము మదిలో
నీ లాంబరమే నక్ష
త్రాల గొడుగుపట్టి, భువిని లాలించుగదా !

## 136

వీరప్పన్ కన్నడ కం
఼రీరవ రాజ్‌కుమరుని, కడు రీవిగ వలలో
దూరిచె, ఇరు రాష్ట్రపు స
ర్కారులు ఆ బందిపోటు కంజలి పట్టెన్ !

## 137

నిర్వ్యధన జీవితమునకు
నిర్వ్యధ, నిర్వ్యాడపథము, నిర్నిద్రతయే
నిర్వ్యాధి అన్ని వెతలకు
నిర్వ్యాజ విశుద్ధ సత్యనిగ మాచరణే !

## 138

మండిపడుచండు గ్రీష్మని
గుండెలదురునట్లు పాడు కొనునుపికమ్ముల్
కొండంత ఆపదైనను
గుండెబలమ్మున్న ఎదురు కోవచ్చు నరుల్ !

## 139

సృష్టి రహస్సుల వెరిగెడి
దృష్టి నిసాధించ నాల్గు దిక్కులలో జ్ఞా
నేష్టులు నెరిపిన, నా సం
తుష్టియు, హృష్టియును కాలధునిలో కలిసెన్ !

## 140

మధుపానము కలిగించెడి
విధునవమగు మత్తు వెంటవెంటనె వీడున్
మధు రాతి మధుర ప్రియసఖి
అధరామృత మత్తు జీవితాంతమ్ముండున్

## 141

బస్సుకు అందము వేగము
"మిస్సు"కు అందమ్ము నగవు మెరిసెడిమో మే!
'ఛెస్సు"కు అందము గెలుపే
ని స్సారపు బ్రతుకున కెదనిబ్బర మందమ్!

## 142

ప్రేమ లిపి, ప్రేమ భాషయు
ప్రేమ మనోభావశైలి, రీతులు గీతుల్
ప్రేమకు బలమును ఫలమును
ప్రేమే యని బ్రతుకునట్టి ప్రేమికులేనో!

## 143

ఆదితుదిలేని సృష్టిని
ఏదైవము ఎట్లు చేసి ఎటనున్నాడో!
వాదవివాదము లెందుకు
నీ దారిని నీవు పొమ్ము, నిజమెవడెరుగున్!

## 144

ముద్దిడిన మూతి కాలని
ఒద్దికగల దీపమొక్కటున్నది భువిలో
నిద్దవు శిశువుల మొగమది
ముద్దాడిన ముద్దులిచ్చు మురిపము తోడన్!

## 145

కందములు, ప్రాస గణయతు
లందాలుగ కవిత లెందరల్లరు ? విను, నీ
కందంబులు రసవన్మా
కందంబులు లోకమందు కవి చౌడప్పా !

## 146

జరిగిన కథ ఒకటుండిన
జరుగగ బోయేటి కథకు జతయౌను కదా!
జరుగుచునుండెడిదటు ఇటు
అరయుచునే కరిగిపోవు, అందో ఇందో!

## 147

పరలోక సుఖము కోసము
పరుగెత్తకు ఆత్మవిద్య పటముల వెంటన్
పరతత్వ మెరిగి యుండుట
ధరలో పరిపూర్ణ జీవితముగడుపుటకే

## 148

నేనే, నాకే యనుచును
నా, నాముములేని దెల్ల నా శన మైతే
నే నాకు సుఖమ్మను, అ
జ్ఞాని అహంకారము గని జాలి పడవలెన్ !

149

పన్నులు ఎగవేసెడి సం
పన్నులకకే బాధలేదు, బడుగులైన, ఆ
పన్నులకే వెతలన్నియు
అన్నార్తుల జీవితాలకన్నీసుడులే !

150

ఇతిహాస పురాణమ్ములు
శ్రుతిచేసిన మతములన్ని సుందరసత్యో
ర్జితములె సందర్భోచిత
గతి వానిని ఆచరింప గలిగిన ఎడలన్

151

క్షీణించును కండబలము
క్షీణించును పంటి కంటిచేవ క్రమముగా
క్షీణతల ఆపగల్గు దు
ర్ణీతగల దొక్క ముదిమిలేని మనసుకే !

152

కడలిని లేచిన కెరటము
తడబడి పడిపోవు మరల తానే లేచున్
పడుటయు లేచుట సహజము
వడిగల బ్రతుకులకు, సృష్టి పరిణామముకున్

## 153

కాలము అనంత మైనది
మూలము లేకుండ పుట్టి, ముగియుట ఎపుడో
తేలని నాటకమాడెడి
లీలావతియైన ఆ అలేఖ్యకు ప్రణతుల్

## 154

కొందరు మెప్పెడి పద్యాల్
కొందరు డెందముల మెచ్చు కొను గేయమ్ముల్
కొందరికి నచ్చు గద్యాల్
స్పందనతో వ్రాసితి చదువరులందరికై !

## 156

మునుమాయా మంత్రమ్ములు
ఘనతర జపతపజయాలు, కలలోనైనన్
కనివిని ఎరుగని వింతలు
కనపడు ఈనాటి కాలకంప్యూటరుపై

## 157

మును పాకకవి సెలవిచ్చిన
కనకపు సింహాసనమున కరచుక కూర్చుం
డిన ఈ నడమంత్రపు సిరి
ఘనులకు, జ్ఞానోదయమ్ము కలిగేదెపుడో ?

## 158

కొమ్మలన్ని నరికి కొనిపోయి నందుకు
చెట్టుగుండె బాధ తట్టుకొనెను
పక్షిగూళ్ళ ఎన్నొ పతన మైనందుకు
కుమిలి కుమిలి చెట్టు కూలిపోయె !

## 159

వచ్చిపోయెడి మబ్బుల వరద కాదు
పెరిగి తరుగుచు తిరుగు జాబిల్లి కాదు
ముక్కలైనట్టి చుక్కల మూట కాదు
కాదు-లేదులు లేని ఆకసము కవిత !

## 160

"నేను' అనుమాట కర్థము నిర్ణయించి
"నీవు అనునది ఎవరినో నిర్వచించి
'వస్తు' వేమిటో సూచించి, భాష రీతి
తెలసి వ్రాయని కవితకే దిక్కులేదు

## 161

సమయ సందర్భశుద్ధి లేశమ్ము లేక
చేసెడిది ఏదియైన వర్జితమె గాన
కాటి కేగు కవికి పురస్కార మిడుట
అతని కంతిమ సంస్కారమౌనుగాదె !

౮

## 162

మట్టి-బీజము కలిసిన మనసులోన
లీనమౌ నీటి జీవన లీల చూచి,
స్నేహ సౌహార్ద శీలము చివురులెత్తు
తరువు కావలె మనిషి స్వాంతమ్ము కూడ !

## 163

ఎప్పుడును సాగిపో దారి తప్పకుండ
కోరిన స్థలమ్ము లపుడప్డు చేర గలవు !
ఆపబోకు నౌకాయాన మాశవీడి
తీరములు అపుడప్పుడు తార సిల్లు !

## 164

సహజ శక్తి ఉండి చదువులేకున్నను
ఎదగవచ్చు మనుషు లెంతకైన
చదువు ఎంత ఉన్న సహజాత ధృతి లేక
పొందలేరు జయము ఎందులోను !

## 165

మనుషులందరు మహిలో సమానులేను
అనెడి మార్క్సు సిద్ధాంతము కన్న మిన్న
అంతయే కాదు దేవుని యంతవాడు
ప్రతి మనిషియను అద్వైత హితమ్ము కాదె !

## 166

జగములోన రెండు జంటలే ఉన్నాయి
అవి, చరా చరము, చిరాచిరములు
ఎందులోన నీవు ఏమిటో తెలిసికో
పొందగలవు బ్రతుకు నందు సుఖము !

## 167

కొప్పులోన జడలు గొంతులోన విషమ్ము
మెడను పాము, మేను మీద బూది
వేషమింత ఎంత విడ్డూరమైనను
వరము లిచ్చు విశ్వ వరుడు హరుడ !

## 168

కష్టముసుఖములిచ్చి, కలిమిలేవములు ఇచ్చి
ఈయలేదు బ్రతుకు ఎందు కొరకొ !
కాలు చేతులిచ్చి కర్మేంద్రియములిచ్చి
ఈయలేదు శరీర మెందుకొరకొ?
విరు లిచ్చి, తరులిచ్చి పికశుకమ్ములనిచ్చి
ఈయలే దామనినెందుకొరకొ
ఇల్లు వాకలి ఇచ్చి పిల్లజెల్లనిచ్చి
ఈయలేదు కుటుంబమెందు కొరకొ
వ్యాకరణమిచ్చి, ఇచ్చి శబ్దాకరములు
ఇవ్వలేదొక కావ్యము నింతవరకు!
శక్తియుక్తులనిచ్చి ఉత్సాహ మిచ్చి
చేరవలసిన గమ్యము చెప్పలేదు!

## 169

పద్యమన్నది కందపద్యమేనాయని
అదరగొట్టును క్రొత్త ఆటవెలది
విలసనమ్ములు ఆట వెలదివేనా యని
సూటిగా ప్రశ్నించు తేటగీతి
రీతి శోభలు తేటగీతి వేనాయని
విరుచుకు పడు వీరవృత్త సేన
శైలి శిల్పాలు వృత్తాల సొత్తాయని
చిటపటలాడెను సీసమేమొ
అందమగు ఛందముల కీచులాట చూచి
పద్యకవులేమొ సంబర పడుచునుండ
పద్యముల శక్తి మింగుడు పడని వారు
చనిరి, పద్యాలు కొట్టుకు చచ్చుననుచు!

## 170

ముక్కు, చెవులు కనులు, మూతి అందరికున్న
ముద్దులొలుకె ఆమె మోమున అవి,
నడకలెన్ని ఉన్న నడుమును మంత్రించి
ఆమె నడచు నడక అమృత మొలుకె !

## 171

మనుషులు మహాత్ములెందరు మరుగుపడిన
మరుగు పడరాదు స్వాతంత్ర్య తరణి దీప్తి
చితికి పోరాదు ఏ పరిస్థితులనైన
సమ సమాజ ప్రజాత్మ విశ్వాస శక్తి !

## 172

పలుకు పలుకున సత్యమ్ము చిలుకు వాడు
చిచమలానంద క్షేత్రాల సేద్యకాడు
పుట్టపర్తిని కైలాస పురము చేసి
ఇలును పాలించు సత్య సాయీశుడేను !

## 173

రాజకీయానికి పుడు అర్థమ్ము మారె
దేనినో ఒకదాని నే తీరునైన
వంచ,ల తోడకాని హింసించిగాని
హత్య చేయక రాజకీయమ్ము కాదు !

## 174

ఓట్లనో  నోట్లు బుల్లెట్లు కాట్లువేయు
ప్రజల పంచేంద్రియాలపై వ్రాలిపడుచు
కాకి క్యాసెట్లు బోధించు, "కావు కావు"
అనుచునే పచ్చబద్ధాలు అన్ని చోట్ల

## 175

రవియుకాననిచో కను కవియటంచు
కవి యెవడు శాప మిచ్చెనో గాని, ఇనుడు
కాంచలేనట్టి చీకట్లు కాంచి కాంచి
కరగుచుంటిని దు ఖాశ్రు కణమునౌచు!

## 176

పుడమి కడుపులోన పోకిరి లావాగ్ని
రాతి పొరల దాగుమూత లాడె
సృష్టిదృష్టికి అదిచెలగాటము భరత
ఖండమునకు ప్రాణ గండమాయె

## 177

మనిషి ఆతని పూర్వీక మర్కటమ్ము
పుట్టనప్పుడు ఏ జీవి పుట్టనపుడు
చెట్టు చేమలు నీరైన పుట్టనపుడు
పుట్టినది గుట్టుగా కొండగట్టురాయి !

## 178

తానను భవించడేని అర్థమ్ము కాదు
ఒరుల బాధలు బరువు లెవ్వరికి గాని
సానుభూతి లక్ష్మణు వియోగాను భూతి
రామునికి గల్గె సీతా హరణము వలెనె !

## 179

హత్యలే హత్యలయ్యె, ప్రహ్లాదులెవరు
"సత్యనారాయణా" అంటె హత్యలనిరి
హత్యకాకుండా మిగిలిన సత్యముంటె
ఆత్మహత్యల పాల్జేసె అంధనీతి !

## 180

బాధపడెడి వారు బాధించువారును
వట్టి అభినయించువారె యంచు
తెలిసి కూడ వెండితెర మీద దృశ్యాలు
కాచి కంట నీరు నించు టేమి ?

## 181

పుట్టినది గిట్టు, బ్రతుకు బుద్బుదమె యంచు,
ఎరిగియున్ నరుల్ చాపు పేరెరుగనట్లు
ప్రాకులాడెరె యశము ప్రాభవము కొరకు
వాస్తవముకన్న బ్రతుకలో బ్రాంతిమిన్న !

## 182

జనుల జీవనాడులను తంత్రులను జేసి
సత్యవాణి వినుచె జాషువాయె
కపట కలుషనాటకము లాడిన చరిత్ర
బుద్ధివచ్చి తప్పు దిద్దు కొనియె !

## 183

కష్టజీవుల వెతలెల్ల కవితలయ్యె
చిత్రకారుని రంగుల చిత్రమయ్యె
గాయకులగళ సీమల గా నమయ్యె
కాని కష్టాలు తొలగుటే కల్ల అయ్యె !

## 184

తనయుడుగ ఇచ్చితిని తలిదండ్రులకును
తండ్రిగా ఇచ్చినాను నా తన యులకును
ఇచ్చుటయెగాని అర్థించుటెరుగ నట్టి
జీవితమునిట్లె ముగియింప జేయదలుతు !

## 185

కోరి కోరి వేసుకొంటి ఎడారిలో
నీరు కనుగొనగ గుడార మొకటి
చూడుచూడుమంటు సుడిగాలి చెలరేగె
మిగిలినాను నేనె మింటి క్రింద

## 1186

తన ఉనికి తానె తెలియనంతటి విశాల
సృష్టి నే చుట్టబోవు నా దృష్టిని గని
కోటి కోటి నక్షత్ర చక్షువుల కూడ
చాలవని కుందు నింగియే జాలిపడును

## 187

సురజగత్తున ఈ “బీరు” చొరక బోదు
కాన మన సార త్రాగు డిక్కడవెయంచు
కొంటెనవ్వుల గుబ్బెతల్ కొసరి కొసరి
అమ్ముదురు నెదర్లాండు బార్లందు బీర్లు

## 188

పాతబడుట తీసిపాదవేయుటగలేని
నగ్నతను ధరించు నట్టి వారు
ప్రాణవిత్త మాన భంగ భయము లేని
స్థితికి చేరినట్టి సిద్ధు లేమొ !

## 189

హిమగిరీంద్ర శిఖరి హిందూ మహేంబుధి
గంగ, యమున, కృష్ణ కలవు మనకు
కలవు తూర్పు పడమరల కనుమలు మనకు
కవిరవీంద్ర నాధు కలడు మనకు

## 190

పతులు వచించగా ఉపపతుల, గూడి
పతితలౌతున్న సతుల దుస్థితుల తేట
తెల్లమొనరించినట్టి మన మొల్ల ఎరుగు
ధర్మమేదియొ భువి పాపకర్మ మేదొ !

## 191

స్వప్నముల మాయలో జిక్కి భంగపడిన
కళ్లలోనికి వాస్తవ కాంతి యగుచు
వచ్చి, నా జీర్ణ శైశిర వాసమందు
నవ వసంతము నాటె జ్ఞాన ప్రమాన !

## 192

అవ్యవస్థితావ్యక్త గాఢాంధకార
బంధురమ్మైన నా మనో బ్రమ్ములోన
సువ్యవ స్థిత ప్రణయ సంశోభితార్ద్ర
ధామమును కట్టినది "సత్యభామ" సదృశ !

## 193

వేయవచ్చును ప్రశ్నలు వేన వేలు
బదులు చెప్పెడి వారివే బాధలన్ని
చదువు కొనువారు ఏదైన చదువవచ్చు
వ్రాయువారివె చింతలు వంతలన్ని !

## 194

నీల గగనగోస్తనీరసమ్మును త్రాగి
వచ్చి, పాత స్మృతులు వదలి వేసి
కాల భోగి కనని కాంతులు కను చెలి
కనులచుట్టు నేను కాటు కైతి !

## 195

ఒక్క మధు పాత్ర చేబూని చక్కనైన
చుక్క సాకీని కనులార చూచుకొనుచు
ఉమర ఖయ్యాము పాడిన అమరగీతి
మానవునికి జీవన తత్వ "పానశాల"

## 196

ఈ రసాల వృక్షాల కోయిల గళాలు
పోసిన సుగాన సుధ త్రాగి వేపె నే మొ
మండుటెండల గ్రీష్మండు బెండు వోవ
మధువుతో పొంగు లెత్తె నామ్ర ఫలజాతి!

## 197

దొడ్డదైన గాని దూరమౌ కొలదిగ
చిన్న దౌచు పోవు చిత్ర ముగను
చిన్న పెద్దలన్ని కన్నులందే కలవు
దూర మౌచు మనకు చేరు వౌచు ।

## 198

లాగెనో లేదా పసుపు చేలాయి ప్రిదుల
శిశిర దుశ్శాసనుండు గర్జించి వచ్చి,
పచ్చపచ్చని క్రొవ్వలిపమ్ములు రల
వనకుమారి వసంతయై వరలెనదుగొ ।
ఏమురారి మొరాలించె నేమొ గాని ।

## 199

ఒక్కటీ అంత రమ్మదేవునికి నీకు
స్వప్న మాతడు కనిపించు సత్య మీవు!
అందుకే నిన్ను దేవుడా యంచు పిలువ
భయపడుచు నుంటి నీ మీది భక్తి కలన

## 200

ధనమున్నచాలు సద్గుణముతో పనిలేదు
తెలుగు వాడతని తెగపొగడును,
అధికారమున్నచో అర్హ్వలన్నిటికిని
ఆంధ్రుడాతనికి జోహారులనును
ధనమధికారముల్ పెనవేసుకొనియున్న
తెలుగువాడతని దేవుడనును
ఈ రెండు గల్గిరౌడీకూడ అయిఉన్న
ఆంధ్రడాతడె పరమాత్ముడనును

తెలుగు గడ్డపై నేడు ఈత్రిగుణశీల
మున్న వానికి కొరత ఏమున్న దింక!
ఏ ప్రభుత్వము చట్టాలు ఏవియైన
సర్వ విధభోగభాగ్య గంధర్వుడతడు!

## 201

ప్రేరితండు కాని విదార్థి మనసుకు
పట్టదేది బోధ పరచు విద్య
పట్టి సమ్మెటెంత కొట్టినా సాగునా
ప్రజ్వలితము చేయబడని ఇనుము

## 202

మండుటెండల దాడికి గుండెలదరి
టిక్కెటులు లేని వంబ్బుల ట్రేను లెక్కి
వార్నిధులు నేలకు వలస వచ్చెనే మొ
వరదలెత్తెను వాగులు వంకలెల్ల !

## 203

వేయివాసంతముల నుండి వెదకి వెదకి
తెలుగుసాహిత్య శారద తెచ్చుకున్న
జ్ఞాన పీఠపురస్కార గౌరవమ్ము
విశ్వనాథ నారాయణ విబుధులేను !

## 204

బ్రతుకు బాధలు, గాధలు, శ్రుతులు, గతులు
వెలుగు చీకట్లు కనుకట్లు, కలిమి, బలిమి
సత్యశీల రసాక్షర ఛంద మలరు
నవ్యగీతమ్ము "గీట్లజనార్ద"నుండు

## 205

మట్టియెంత ఉన్న చెట్టు జీవించునా
తడి యొకంతయైన తాకకున్న
సిరులవెన్ని యున్న నరుడు సుఖించునా
చుక్కయైన కంటి చూపులేక!

## 206

రాలిపోవలె శిశిరమవోలె ఈసు
తేలి రావలె ఆమని వోలె ప్రేమ
కావలెను మానవాళి కే ఖండమైన
మానవత్వమే ఏకైక మందిరమ్ము

## 207

నల్లధనార్జనకెల్లలు లేవయ్యో
పేదవానికి తోక బెత్తెడే
అధికారమునకు బాధ్యతాలేవి లేవయ్యో
ఒటర్లకో గుండె పోటులయ్యో !
యజమానులకు అక్రమార్జనలెన్నెన్నో
శ్రామికులకు నిరశనవ్రతములు
అవినీతి పరులకే ఆయరారోగ్యాలు
చట్టబద్దులు కాల సర్పహతులు
ఏమి స్వాతంత్ర్య మోగాని ఎందుకనిన
"బడితగల వానిచే ఆయ్యే బర్రె' నేడు
పీడితులు తాడితులు ఊరు పేరు లేని
జనగణమునకు మిగిలెను "జనగణమన' !

## 208

నల్ల బజారులో నానా విధములైన
వేషాలు వేసెడి విద్యలెరిగి
ఆఫీసులందు సర్వావస్థలందు న్యా
యార్తుల పితులకు వ్యూహముల పన్ని
కాంట్రాక్టులందున కాజేయ వలసిన
దెంత ఎవరెవరికో తంతులెరిగి
రాజకీయాల దుర్గాలు జయించేటి
వక్రమార్గాల గోప్యమ్ములెరిగి
ఏ ప్రణాళికి పధకాలు ఎట్లు ఉన్న
శాసన నిబంధనాదులే సరళి ఉన్న
ఎవరు అధికారమున ఉన్న ఏమియైన
జయము సాధించు అవినీతి, జగతినేత

## 209

సోమరి ఎండుటాకు, కడు
చోద్యముగా పెనుగాలివాహన
మ్మేమరకుండ నెక్కి కను
మేరలు దాటి సుదూర జీవితా
రామము చేరబోవుసుక
రమ్మగ, నన్నటులే తృటిన్ పరం
ధామము చేర్చు సత్కృతి ర
ధా గమునమ్మునకై తపించెదన్ ।

## 210

మానవుడాత్మ వీడి పర
మాణువుతో జతకూడి, లోభమో
హాన మదాంధుడై తన ప్ర
పంచములో విల యాగ్నిరేపగా
పూనిన కుట్రలన్ తెలిసి
భూజనయిత్రి ప్రియానకన్న సం
తానపు ద్రోహబుద్ధికి మ
నమ్ము విదుల్చుక ఏడ్చు నల్లదే ।

## 211

రాయిని గూర్చినే కవిత
వ్రాయుదు నెందులకన్న అందులో
నే యెనలేని సత్యముల
నీడలు జాడలు దాగియున్నవే

మోయనిపంచు నాకు, ప్రణ
వోద్భవసృష్టి రహస్య బోధనా
మ్నాయము ప్రస్తరమ్మయి, అ
మాయికతన్ నినదించు నా మదిన్ !

## 212

ఎనుబదియారు వత్సరము
లీ జగమందు వసించి, వెళ్ళిపో
యిన నను కన్నతండ్రి కను
పించును నా పరితప్తచేతనా
వనికల మీద, నేను పసి
బాలుడనై పరికించుచుందు, జీ
వనమరణాలనే యుగళ
పాత్రల నాటక కాల చిత్రమున్

## 213

పలువేషంబులుదాల్చి, నాగరికతా
భాసన్ ప్రదర్శించు కు
ట్రలు స్వార్థోగ్రకుతంత్రముల్ కపటదు
ష్టవ్యూ హముల్ పన్ను, క్రము
చ్చులు ఊరేగు ప్రపంచమందు, పశుప
క్షుల్ వోవె పైపైనిక
ప్పులులేకుండ చరించు నగ్నతనులే
పూజ్యుల్ గదా ఎంచగన్ !

## 214

మనిషిని మార్చగల్గెడి స
మర్థుడు మానవుడేను, కాని ఆ
మనిషియె మానవాళికి ప్ర
మాదము లందు ప్రమాదమయ్యె ఏ
మనిషిజగమ్ము స్వర్గముగ
మార్చెడి రాగసుధాకరుండొ, ఆ
మనిషియె, ద్వేష హాల హల
మార్గములన్ కను నారకమ్ములన్

## 215

రౌతును బట్టి యే హయము
రైతును బట్టి పొలమ్ము గావునన్
చేతల మంచి చెడ్డలవి
చేసిన వారిని బట్టియుండు, ని
ష్ణాతులు కాని వారియెడ
శస్త్రము శాస్త్రముచేతులెత్తుంగా
చేతన లేక యే రచన
చేసిన పాపము పద్య విద్యదా !

## 216

మొల్లను గూర్చినే కనులు
మోడ్చి స్మరించితి, కానుపించె ఓ
హల్లక పాణి, రమ్య రజి
తాక్షరవేణి, ప్రబుద్ధ వాణి, తా

నల్లుచునుండె భక్తి రస
మౌక్తిక హారము, కాదు, జానకీ
వల్లభు పుణ్యగాధ ప్రణ
వ ప్రణయాత్మ కథా ప్రబంధమున్

## 217

ఒకరిని చూడగానె ఎది
యో అనురాగము మోసులెత్తు, వే
రొకరిని చూచి చూడగనె
ఓర్వమి ద్వేషము పొంగులెత్తు, దే
నికిగల కారణమ్ము అవ
నిన్ కనరాదు వితర్క హేతు వా
దికి, మరి జన్మ జన్మలకు
తీరని వాసనలుండ కుండునా

## 218

వాదనలేవియైన, అపవాద వివాదము లేవియైన, ని
ర్వేదము లేవియైనను, వివేక విచార వితర్క మౌన, ని
ర్వాదము లేవియైనను చిరాచిర సత్యమెరుంగలేని, నా
వేదలన్ గ్రహించగల వేదములేయని ఆదరించెదన్!

# నవకవితా వాణి

నా ప్రత్యేకత నిత్య నూతనత, వీ
        ణావేణు సంగీత రా
గ ప్రత్యూషము నా నివాసము, నిస
        ర్గ స్వాదు సౌందర్య భా
వ ప్రక్షేపము నా విలాసము, జగ
        త్స్వప్న ప్రబుద్ధాంతరి
క్ష ప్రస్థానము నా మహాశయము, న
        క్షత్రాలు నా కావ్యముల్

ఆదిత్యాంశువులే గణమ్ములు , సమ
        స్తామ్నాయముల్, శాస్త్రముల్
పాదమ్ముల్ , గ్రహముల్ ఉపగ్రహములే
        ప్రాసనల్, యతుల్ , మానవ
ద్యో దౌత్యాశయ దివ్య దిగ్విజయ సం
        దోహమ్ములే భావముల్ ,
నాద బ్రహ్మయె శైలియై వెలుగు నా
        నక్షత్ర కావ్యాలకున్

ఎన్ని గ్రహాలు? తారకలు ఎన్ని అనంతము నందు విశ్వముల్
ఉన్నవి ఎన్నియో తెలియ కున్నవి , కన్నులు ఊహ లున్న, లో
కన్నులు ఉన్న మానవుల గన్న జగత్తున , కింత కాలమున్
కన్న యనేకమౌ కలలు కట్టెదుటన్ నిజమైన నేటికిన్

బాపూ

గాలిని తేలుటే ఘనత
గా తలపోసిన రోజు లేగె , భూ
గోళ ప్రదక్షిణమ్ము ఒక
గోవు ప్రదక్షిణ లీల చేయగా
జాలెడి కాలమున్ గడచె ,
జాబిలి భూతలి మధ్య ఛాయ బా
రాలు ఫలించె నేడు , కవి
రాజయి రోదసి నేలుకొందునే

ప్రేయసి హాస మందు, నిరు
పేదల వేదన లందు చిన్ని పా
పాయిల కన్నులందు, మధు
పాయిల కమ్మనిపాట లందు, మి
త్రాయత మానసమ్ముల, వి
హాయస వీధుల నే వెలార్చుచున్
పోయెడి భావ తారకలె
పో కలకాలపు నాదు కావ్యముల్

యోగ మార్గమున ప్రయోగమార్గమ్మున
కాంచు చుందు దేవ కాలములను
కనులతోడ లోని కన్నుల తోడను
కాంచు చుందు సత్యకాంతి లవము

# అద్వైతము

ఎద కదలించునట్టి తర
లేక్షణలన్ గురుతించి పాట పా
డెద నని, ఎక్కడోగల త
టిల్లతలన్ గని తన్మయత్వ మొం
దెద నని, నోరులేని ప్రకృ
తిన్ నుతియించెద నంచు మీరు న
న్నదయత నిందసేయకు డ
నభ్యుదయుండని హేతుశూన్యులై

వ్రాయగనె విలాసినులపై గేయములను
కూలి పిల్లను మరచు మూర్ఖుడను గాను
ప్రకృతి సౌందర్యముల గూర్చి పాడగానె
మానవుని కష్ట సుఖములే మరువలేదు

మన్నును దున్ను కర్షక కు
మారులు, ఆ గని - మిల్లు - ఫ్యాక్టరీ
మున్నగు వానిలోన శ్రమ
మున్ వడపిండెడివారు క్లార్కులౌ
అన్నయ లందరున్ ప్రజల
టంచు ఎరుంగుదు, వారి బాధ లే
మున్నవొ వారి భావి ఎటు
లున్నదొ కూడ ఎరుంగుదున్ సఖా !

స్వార్థ సంకుచిత తత్వాలకు దూరాన
తేలియాడెడి మేఘమాల జూచి
తన తల్లి యేరు ఒడిని జేరనో యన
పర్వెత్తు సెలయేటి బాల జూచి
తన క్షణ జీవితమ్మును నిశా లోకాన
వెలిగించిపోవు చంచలను జూచి
శిశిరలోకపు గుండె చివురించు పువ్వుల
నవ్వుల నవవసంతమును జూచి

ఎద కరంగ పొంగారగ కదలియాడ
కైత లల్లి పాడితి నంతెకాని, స్వార్థ
పరుడ గాలేదు, నాతోడి ప్రజల వాణి
వినక కూర్చుండినట్టి పాపియును గాను

ఒరుల కష్టము దొచుకొంచు జీవించు దా
నవుల నుత్కృష్ట మానవుల జేయు,
స్వార్థమునకు మర్త్యజాతిని బలియిచ్చు
మారణాస్త్రములలో మంచు పేర్చు
సుఖమును కలనైన చూడని ప్రజలకు
సుమనోజ్ఞ భావిమార్గమును చూపు
మన సంఘ జీవితమ్మును వికారించు దు
రాచారములను చితాగ్ని ద్రోయు

నిశిత కవితలు వ్రాసెడి నేనె కరిగి
కలికి చిరునవ్వులకు భాష్యములు రచింతు
ప్రకృతి సౌందర్యములను కావ్యముల నింతు
కష్ట సుఖముల రెంట భాగమ్ముగొందు

# రసరాగము

మలయ సమీర మన్న మధు
        మాసము లన్న, పికము లన్న - వె
న్నెలలు, మొయిళ్ళు, తారకలు
        నిర్ఝరులన్నను తన్మయుండనై
శిలలు కరుంగునట్లు, పెను
        చీకటు లెల్ల వెలుంగునట్లు, నా
కలలు నిజమ్ము లౌనటుల
        గానము సేతు రసాను భూతులన్

అందిన అందమైన సుమ
        హాసము పొందినవాడ కాన నే
అందని తారకా ద్యుతుల
        కై తపియింతును, నన్ను తన్మ నో
మందిర మందు నిల్పు కొను
        మానిని రాగ మెరింగి నందుకే
కుందుంచు నుంటి నా వలపు
        కోరక నా యెద దోచు వారికై

తారలలోన తార, మధు ధారలలో మధుధార, బాల శం
పా రమణీయ లాస్య సుర బాలలో సుర బాల కోసమై
దారమునై అదృష్టపు ప తంగము నింగికి లేపి, సమ్మతిన్
తీరని తీయనౌ కలల తీరముపై విహరింప బోయెదన్

పూవుల అంద మందరిది
        పూచిన తీవ ఎవళ్ళదైన, స
ద్భావ రసమ్ము అందరిది
        భావుకు డేగృహ వాసియైన, గా
నావళి శ్రోత లందరిదె
        ఆ ప్రియ గాయని ఏరిదైన, ఏ
లా విడ లేరో స్వార్థము అ
        నంత కళావిభవమ్ము కోసమున్

పాడెద వేయి సారు లిదె
        పాటను , పాడెద లక్ష తీరులన్
వాడని భావముల్ మలచి ,
        పాడెద సుందరతాబ్ధి చిత్తునై ,
ఆడెద కోటి భంగిమల
        ఆడిన ఆటనె శూలపాణినై
వీడని దాహ మార్పగల
        వింతరసామృత పానమత్తునై !

# ఆనంద యోగి

ఎవరు ఛేదించ గలరు నే నీ జగాన
కట్టుకొన్న ఆనందాల కలల కోట?
ఎవరు వారించ గలరు నేనీ బ్రతుకును
మధుర గీతాల మాలగా మలచుకొనుట?

ఏను వసంత వాటికకు
నేగి ప్రమోదము చెదకుండ ద్వే
షానల చిత్తు లెవ్వరొ న
నడ్డెద రౌర ! ఎరుంగలేక - నా
లోనె వసంతలక్ష్మి ఎద
లోని ఎదన్ వలె నాట్యమాడి, అ
మ్లాన మహానుభూతి సుమ
మంజరులన్ రచియించి మించుటన్ !

చల్లని సంజగాడుపుల
సాగర సైకతతీర మందు నే
నుల్లము పొంగగా తిరుగు
చుండుట ఓర్వమి త్రోసినారు, ఘూ
ర్ణిల్లు పయోధిలో ఎవరో
రేయిని దాగి, గ్రహింపలేక - రం
జిల్లెద నంచు ఆ కడలి
జీవన మౌక్తిక రత్నదీపమై

మబ్బుల మీదుగ సాగెడి భావ వి
మానములో పయనించెడి నన్
దబ్బిలి ఎవ్వడొ కూల్చగ జూచెను
దారుణ దుష్టగుణాశనియై
అబ్బర మొందెను కుందెను నా సుష
మాంగములన్ని విహంగములై
కబ్బము లల్లుచు గాలిని తేలుచు
గానము చేయుట చూచి మదిన్

కోరుకొన్న గులాబీలు కోయునపుడు
క్రూర మగు ముళ్ళు నా చేయి కోరికి, మురిసి
పడుదు గాని ఎరుంగవు - ప్రణయతత్త్వ
బోధయేగాని నా కది బాధ కాదు

అష్టైశ్వర్యము లేవా నా కడకు రా
నడ్డంకులం బెట్టి పా
పిష్టుల్ నాకిల కష్టనష్టములు దు
ర్భిక్షమ్ము కల్పింతురా!
ఇష్టమ్మైనపు డన్న మే కమికేడో
ఏ నీడయో యున్న నం
తుష్టిం చెందెడి నన్ను, స్వార్థముల వ్యా
ధుల్ బాధలం బెట్టువే ?

అమృత మట్టులనే హాలమలము గ్రోలి
వెన్నెలట్టుల చీకటి కన్నె వలచి
పరవశిల్లెడి నన్ను ఎవ్వరును ఏమి
చేయగలరు? ఇక్కట్లు నన్ చేరునెట్లు?

ధ్రువముల హిమశిల లైనను
అవనీ గర్భాంత రోష్ణమైన భరింతున్
అవమానము సన్మానము
ఎవరే మొనరింప సత్యమేను వచింతున్

# అనిన్ద్య

విను విసిగించి, నీ కనుల
　　నిండి స్రవించు కవోష్ణ బాష్ప వా
హినులను చూచుకొంచు హసి
　　యించుచు, వేడుక జెంద నాకు భా
వన కల, దైన నాకములె
　　భవ్యములై కనిపించు నీదు చ
క్కని నును చెక్కుటద్దములు
　　కందు నటంచు భయమ్మగున్ ప్రియా!

ఎన్ని విధాల నన్ను హృద
　　యేశ్వరి! కోతలు పెట్టినావో, నా
కెన్నగ సిగ్గుకల్గు అవ
　　హేళన లెన్ని యొనర్చినావొ, నీ
కన్నిటి కన్నిరెట్లు కరి
　　నాత్మత శిక్ష నొసంగ జూడ నీ
కన్నులు రువ్వు దృగ్లతలు
　　కట్టెడు నా కరయుగ్మమంతలో

అర్చనము లేని నా యౌవ నాలయాన
చంచలాదేహ ! నిను ప్రతిష్ఠించుకొరకు
ప్రణయ గీత మంత్రాలెన్ని పాడినావొ
ఎన్ని గరళాబ్ధు లీదితి నెరుక గలదె ?

చుక్కల వెక్కిరించు కను

చూపులెగాక, చివుళ్ళు మెక్కిమ

త్తెక్కిన కోకిలమ్మ నవ

హేళన సేయు గళమ్మెగాక, నా

వాక్కుల కందరాని భగ

వంతుని సృష్టికె మూలమౌ ఎదో

చక్కదనమ్ము నీ యెద ని

జమ్ము చెలీ ! కనుగొంటి నా హృదిన్

నీ పదాబ్జాలు చేరవచ్చే పథాల

పరుగు లిడి కోటి గండాల బయట పడితి-

నా ఘనత చేత కాదు అందాల బాల !

నీ ప్రణయ మహిమ వలననే ప్రియతమ !

నీ రవళించు అందియలు

నీరసమైన మదంతరాన ఏ

వో రసవ ద్వసంతముల

'కో' యని 'కూ' యని పించు శ్రావ్యశృం

గార సుధార్ద్ర కావ్యముల

కమ్మదనమ్ములతోడ పాడి, మం

దార మనోజ్ఞ భావముల

నారులు, వోయును, నాట్య సుందరీ !

నీ విషాగ్ని పరీక్షల నెగ్గినట్టి
నన్నె వరియించి, యుష్మద్ ప్రణయ సుమాల
మాల నాకె యర్పించి సౌఖ్యాల నేలు
దేవి! మేధావినివి కళాదేవి వయ్యు

ఈ కొరగాని లోకమున
ఈ క్షణికంపు సుఖాలలోన ఏ
మోకల దంచు నే భ్రమసి
యుంటిని ఇన్ని దినాలు, నేడు నీ
లో కనుపించు కాంతి ఝరి
లో కనువిప్పెను నా యెడంద, నే
నీ కను నీడ లందు రమ
ణీ! రసలోక తపస్వి నయ్యెదన్

పిచ్చి సరసాల నిన్ను ఏడ్పించ నెంచి
ఎదొ ఎదో అనబోయి దేవీ! త్వదీయ
ముగ్ధ లావణ్య మహిమాబ్ధి మునక లిడితి
హాస్యమునకైన నీవు శిక్షార్హ వటవె!

# సరససాగరుడు

ఖండ ఖండాలు నీదుకై దండ లోన
నిల్చుకొన్న మహాంభుధీ ! నీ గభీర
హృదయగానము వినెడి నా హృదయ మందు
నవ్య భావన లేవియో నాట్య మాడు

ఆడుకొందువు, పాట పాడుకొందువు దివా
        రాత్రమ్ము లీవు వారాశి రాజ !
ఇరు సంజలును నీకు మృదు గంధవహ తాళ
        వృంతాలు వీచును వీచి రాజ !
వెన్నెల కన్నె కన్పించిన చాలు మై
        మరచి నీయెద పొంగి పొరలు నౌర !
ఎటు పొరలిన మేను పొటమరించని రీతి
        పరచుకొంటివి ఇసుక పరుపు చుట్టు !

ఎంత రసికుడవో నదీ కాంత లంత
దూర దూరాలనుండి నిన్ చేర వత్తు
రొక్కరికి తెలియకుండ మరొకరు ! సుంద
రతకు ఆనందములకు శరధివి నీవు

ఏ మని పాడె దోయి? ధర జీ పరిణామ కథా విశేషముల్
నీ మధు రానుభూతులను, నీకలలన్ సమకూర్చి తీర్చి శో
భామయ గీతు లల్లుకొని పాడెద వేమొ, అనంతకాల జీ
వామృత సాగరా ! భవ ద యంత్రిత భావ తరంగ వీణపై !

పులకరించితి వేని సజ్జల కణములు
ముక్తి పొంది యైపోవును మౌక్తి కములు
రక్తి చెందెద వేని చిరత్న శిలలు
ధన్యతను చెంది కావె రత్నాల జాలు !

నీ యుచ్ఛ్వాసములే పయోధరములై
నింగిన్, ధరా వర్షమై
ఆయా దేశ నదీ నదమ్ము లయి నీ
యం దేవిధిన్ లీనమౌ
నో యారీతి సమస్త జీవులును ఏ
దో జీవనానంద సం
శ్రేయోవిర్భవ మొంది అందె తుదకున్
లీనం బవున్, సాగరా !

# మృత్యువు

ప్రాణికోటి వసించు ప్రపంచ జలధి
నెన్నొ కనరాని వలలను పన్ని, జీవు
లను తరతరాలుగా పట్టుకొని భుజించు
చున్న ఓ మృత్యు ! నాకు నీ వన్న భయము

పుట్టెడి ప్రాణుల కొరకై
పుట్టెను ఈ సృష్టి, కాని భువిపై ప్రాణుల్
పుట్టుట గిట్టుట తుది నీ
పొట్టం జేరుటకె ! వింత పో విధి కట్టా !

ఇల పూచినట్టి జీవులు రాలి నీ కంఠ
హారమ్ము జేర నున్నట్టి పూలె
వసుధ శ్రుతించు జీవ ధ్వనుల్ నీ కాలి
అందెల జేర నున్నట్టి ధ్వనులె
భువి రెక్కలార్చు ప్రాణి విహంగ రాజినీ
నయనాగ్ని కాల నున్న శలభములె
బ్రతుకుబాటల సాగు ప్రాణులు నీ గర్భ
చితి చేరవచ్చు చున్న తెరువరులె

భూ చరమ్ములు, జలచర ఖేచరములు
ధర వయోభేద లింగ భేదములు లేక
భవ దనంత క్షుధాగ్ని నార్పగ జగాన
కురియు క్షణికపు వాన చిన్కు లనిపించు

పాప మంటని పసిపాప లంచు, బ్రతుకు
భారమ్ము తెలియని బాలు రనియు,
వెతలేని యువక దంపతు లని, ప్రణయ వ
ల్లికల పెంచుకొను ప్రేమికు లటంచు,
తలిదండ్రు లని, పోషకు లని, నిర్మల వయో
వృద్ధు లనియు జ్ఞాన వృద్ధు లనియు
నిరుపేద లని, ధనాన్వితు లని, కష్టజీ
వులని, భోగులని, పాపులని గాని

ఏ విచక్షణ లేక నుంతేని కరుణ
లేక జీవులను బ్రతుకనీక, ఒకరి
కొకరి నెడబాపి, పొట్ట నింపుకొని మృత్యు
వా ! అవని శోకమయముగా జేయనేల ?

పలు రోగముల రూపములు దాల్చి ఒకసారి,
అగ్ని ప్రమాదమవై ఒకపుడు,
పాము కాటుగ, జారుపాటుగా ఒకసారి,
ఆత్మహత్యా వాంఛవై ఒకపుడు
బాకుపోటుగ, ఎదో బాంబుపాటుగ, భయం
కర యుద్ధరూపిణిగా ఒకపుడు
వరదవై, పిడుగై, తుపానువై, భూకంప
మై, శిలాద్రవరూపివై ఒకపుడు

అవతరించి జీవులను స్వాహా యొనర్చ
అటుల జచ్చె ఇటుల చచ్చె నని జనమ్ము
భ్రమల చిక్కి ఏడ్చెదరు , పట్టుమ్ము నీకు !
కామరూపిణివే మృత్యుకాంత నీవు !

ఒకవేళని ఒక చోటని
ఒక సందర్భమని నియమ మున్నట్టులు లే
దు కదా నీ వేటకు చే
తికి చిక్కిన చాలు నంతె తిని వేతువెగా !

సురలు సుధ గ్రోలి నిను జయించిరి స్థిరముగ
జడ జగత్తేమొ నీకు లోబడదు , ఇంక
దొరికెనా ప్రాణికోట్ల ఊపిరులు నీకు
చావు లేదేలనే మృత్యు దేవి నీకు ?

నిను నిందింతునుగాని, నా ఎడద ప్ర
శ్నించున్ ధరకాశ వా
రి నిధుల్ గెల్చుచునున్న మానవుడు గ
ర్విష్ఠుండు, లోభుండు, హా
యిని కాంక్షించెడి వాడు నీవను భయ
మ్మే లేనిచో ఈ జగ
మ్మున ఎన్నెన్ని హిరోషిమాలు నరక
మ్ముల్నించునో ? యంచునన్

ఘన ఘనాపూర్వ విజ్ఞాన కవచ ధారి
భావ నాతీత పృధు రోదసీ విహారి
రాగ మసృణ విశ్వంభర రాయబారి
అడుగు పెట్టెను చంద్రలో కాంగణాన

తన నిర్జీవాంకము విడి
చనె జాబిలి యంచు వగచు జగ దంబకు నే
డెన లేని పండు గయ్యెను
మనుజుడు భూమాత చంద్రమాతను కలిపెన్

ఇతిహాసస్థ పురాణ వేద గత మౌ
        నీంద్ర శ్రుతి క్షిప్తయో
గ తపోంతర్గత సృష్టి జీవన రహో
        గాథల్ ఎవో బావనా
లతలో స్వప్నములో విముగ్ధ మధురా
        లాపమ్ములో గాక, భా
వి తమ క్షేత్ర సుషుప్త వాస్తవికతా
        బీజమ్ములై లేచెడిన్

చెరగని ఆత్మజ్ఞానము
తరగని మేధా జనిత పదార్థ జ్ఞాన
మ్మిరు కడల వెడలి కలిపెను
పరిణామ ద్వంద్వ ప్రకృతి పథ మేళనమై

భూమి జయించె మానవుడు
        భూరి పయోనిధులన్ జయించెగా ,
వ్యోమముకూడ నే డసదృ
        శోద్గమ మందు జయించి మించె, ఇం
కేమిటి, భావి జీవన గ
        తీందిర లక్షిత లక్ష్య మేమిటో ?
ఏమిటి ఏమి టంచు నిన
        దించె నవే చకితాంతరాళముల్

కరువులు కాటకాల్ బ్రతుకు కష్టము లన్నియు తీర్చుకొంటకై
వరము లభించెనా, పరుల భాగ్యముకోసము నేలకోసమున్
జరిపెడి యుద్ధ తంత్రముల జాడలు గోడులు మాసి పోయెనా,
ధరణికి స్వర్గ సీమకును దవ్వు కడుంగడు తీరిపోయెనా ?

తన కుటుంబపు గొప్పతనముకై ఊ రెల్ల
        'తగలెట్టు' సంకుచితత్వ నీతి
తన ఊరు పేరుకై తన రాష్ట్ర మంతకు
        గరళమ్ము పెట్టు మూర్ఖత్వ నీతి
తన రాష్ట్ర ఘనతకై తన దేశవృద్ధిని
        భంగపరచు దానవత్వ నీతి
తన దేశ యశము కితరదేశముల బలి
        దానము గొను మనస్తత్వ నీతి

మానవు డజేయు డికపైన మాను కొనునొ
లేక తనలోకమైన భూలోక కీర్తి
సాధనకు సర్వ లోకాల శాంతి సుఖము
చెరగొనునొ స్వార్థ లోభాలచేత జిక్కి

# కామరూపిణి

శుక మీవె పిక మీవె చూతశాఖిక వీవె
　　శుక్తి వీవే నీవె మౌక్తి కమ్ము
గిరి నీవె ఝురి వీవె ధరణీతలము నీవె
　　జలధి వీవె నీవె జలధరమ్ము
పూ వీవె తా వీవె పూలపందిరి వీవె
　　గంధ మీవె నీవె గంధవహము
కల వీవె నిజ మీవె కామరూపిణి వీవె
　　గీత మీవె నీవె శ్రోతచయము

జడము నీవె చేతన మీవె జాగృ తీవె
నిద్ర వీవె జీవన్మరణ ముద్ర వీవె
గమ్యమీవె నీవెను మార్గము శకటము
వింత ఏమి ? నీకొరకె జీవింతు-

# మార్గదర్శి బూర్గుల

ఏ దేశ చరిత్రైనా
ఆ దేశ ప్రజల చేత ఆవిష్కృతమౌ
ఈ దేశ జనుల శక్తికి
చేదోడైనట్టి కార్య సిద్ధులు పూజ్యుల్

రాచరికమ్ము సల్పిన, నిరంకుశ కర్కశ దుష్ట భ్రష్ట పై
శాచిక పాలనమ్మును, నిజామును అంతము చేయబూని, వీ
రోచిత శాంతి విప్లవ పురోగమనోద్యమముల్, తుఫానులై
లేచిన నాటి రోజులు స్మరించిన దేశము పావనమ్ముగున్

రామకృష్ణుల దివ్య నామ విస్ఫూర్తి, నీ
        పరిపూర్ణ జీవిత పథము వేసె
వామనత్వము నిన్ను ద్యోమండము నిండు
        విజ్ఞాన ప్రజ్ఞాన విదుని జేసే
నారసింహత్వమే కోరి భారతదేశ
        నాయక శిఖరాల నాటె నిన్ను
స్వాతంత్ర్య వాంఛ సేవా భావ సంస్కృతి
        నీకు ఉజ్వల రాజనీతి నేర్పె

శారదయె సృజనాత్మక సత్వమిచ్చె
త్యాగమే నిన్ను కీర్తి సౌధమున నిలిపె
నీ సతి అనంతలక్ష్మి నిన్ నిలిపి మదిని
కొలిచినది పరమాత్మను తలచికొనుచు

మంత్రివైతివి ముఖ్య మంత్రివైతివి కాని పదవిచే నీకు మత్తొదవలేదు
ప్రభువు వైతివి రాజ్య మనిషిని మరువలేదు
త్యాగివైతివి రాజయోగివైతివి గాని దర్పము నిన్నెప్డు తాకలేదు
జయము కల్గిన, పరాజయము కల్గిన గాని ధర్మమార్గమ్మెప్డు తప్పలేదు

సంపదలు ఉన్న లేకున్న సత్యసాధ
నమ్మునకు మిన్నలేదని నమ్మినావు
త్రికరణ విశుద్ధ గల కళాత్మకుడ వీవు
మరచిపోదు చరిత్ర నీ మహిత పాత్ర !

సంహరణవాదమును త్రోసి సంస్కరణ వి
ధానమును ఆచరించిన ధార్మికుడవు
యోగ మర్మజ్ఞుడౌ కర్మయోగి వీవు
ఇహపరానంద సూత్ర సంహితుడ వీవు !

సత్య దర్శన శీల సాహిత్య రుచులు
తెలుగు భాషకు ప్రేమతో తెచ్చి ఇచ్చి
మానవత్వపు విలువలు మప్పినట్టి
సత్వ గుణతత్వ రసకోకిలత్వ మీవు !

నిన్ను తొలిసారి నే కల్సికొన్న యపుడు
ఓ అమాయక విద్యార్థి నాయకుడను
నిన్ను మనసార తలచుకుంటున్న వేడు
కాలగతి చూచి భీతిల్లు బాలకుడను

అధికారమ్మొ ధనమ్మొ తప్ప మరియే అంశమ్మొ రాణించలే
ద, ధిపుల్ కారు వివేకవంతులు సువిద్యాబుద్ధి సంపన్నులున్
బుధులున్ శాస్త్ర కళా విశారదులు సంపూర్ణాత్మ విజ్ఞానులున్
విధి సైతమ్మొ ధనాధికారములకే వీగన్ వలెన్ నేడహో ।

చిర యశస్వీ! నిన్ను "శ్రీకృష్ణదేవరా
　　యాంధ్ర భాషా నిలయము" న గంటి
మేధానిధీ! నిన్ అమేయ విజ్ఞాన సు
　　జ్ఞాన సాహిత్య భాషణల గంటి
సృజనశీలీ! నిన్ విశిష్ట భావావేశ
　　పటుతర కావ్య సంపుటల గంటి
రాజనీతిజ్ఞ! నీ లక్ష్య సాధనము, స
　　మైక్యాంధ్ర రాష్ట్ర దృశ్యమున గంటి

కంటి కలగాదు, నిజముగా కంటి నిన్ను
నీ శతజయంతి ఉత్సవానేక సభల
కంటి అఖిలాంధ్రమందు ఇంటింటిలోన
కీర్తిమయ! బూరుగుల రామకృష్ణరాయ!

కంటిన్ బూర్గుల రామకృష్ణుని తెలంగాణా యశశ్శృంగమున్
కంటిన్ తెల్గుల మేటి స్వప్నమగు, ఏకైకాంధ్ర రాష్ట్రావనున్
కంటిన్ నేటి సమైక్య భారతి ఒడిన్ గంగాత్మ శంఖాకృతున్
కంటిన్ నే శతవర్ష జన్మదిన భోగంబందు మృత్యుంజయున్

బాపూజీ

# ముక్తివాహిని

ఆగదు విప్లవ మ్మిక ని
యంత ల దెంతటివారిలేని, స్వే
చ్ఛా గగనమ్ము చిమ్ము విల
సత్ పృథుకాంతిశరాలు చీల్చెనో
హో! గరళమ్ము గ్రక్కు కుటి
లోగ్ర నిశా పరదాస్య రాక్షసిన్!
మ్రోగెను బాంగ్లదేశ జయ
మోహన సింధుగళాల దుందుభుల్

పదనుకత్తుల వోలె పడుచువా ళ్లెగసిరి
బాకులై రదె పసిపాప లంత
కన్నెపిల్లలు మిషన్ గన్నులై నిల్చిరి
ముదుసళ్ళు ముల్లెల మోతలైరి
వీర విద్యార్థులు భూరిబాంబులు కాగ
ఉద్యోగులే వృత్తి విద్యలైరి
రాల్లురప్పలు సహా దైఫిళ్ళు తూటాలు
అడవులు గిరులు రణాంగణములు

ముక్తి వాహినియై జనశక్తి మించె
పారతంత్ర్యోగ్ర వలసాధిపత్య దాన
వత్వమును కూల్చె నదె ప్రజాస్వామ్య లక్ష్మి
కలదె స్వాతంత్ర్యమునకన్న ఘనధనమ్ము ?

సైన్యోన్మత్త నిరంకుశత్వము ప్రజా
స్వామ్యమ్మునే తన్నె, ఏ
మన్యాయం బని ఏడుకోట్ల ప్రజ ప్ర
హ్లాదుండునా లేచె, కా
రుణ్య శ్రీహరి షేక్ ముజీబు నరశా
ర్దూలంబునా చీల్చు నా
హా ! న్యాయాత్మక దాస్యరాక్షస మదా
హంకార వక్షంబులన్ !

నీతి నీమము వీడి సీతను చెరగొన్న
రావణుం డాతని రాక్షసతతి
సత్యశాంతి ధర్మసతుల హింసించిన
దుర్యోధనుడు వాని దుష్టశతము
పాపమే ఎరుగని ప్రజల భక్షించిన
బకుడు నరకుడు తత్పాపిగణము
మానవత్వపు టింట మంటలు రేపిన
హిట్లరు అతని స్నేహితుల మూక

చచ్చి రే గతి ఆ గతి చావగలరు
పశుబలముతోడ కండకావరముతోడ
మానవుల రక్తమును త్రాగ మరిగినట్టి
దుష్టులౌ బాంగ్లదేశ విద్రోహు లెల్ల

బాపూ

అరువుకు తెచ్చుకొన్న బల
హంకృతితో చెలరేగు శత్రు శా
ర్వరపటలాలపై ప్రజల
పౌరుష రోషము లంబుదంబులై
కురిసెను నీరుగాదు పిడు
గుల్ వడగండ్లు తుపాకిగుండ్లు, త్యా
గ రుధిర సాగరాత్మరమ
గా ప్రభవించెను బాంగ్ల ముద్ధతిన్

భారత భూరమ బాంగ్లా
స్వారాజ్యేందిరకు పల్కె స్వాగత గీతుల్
అ రెండి మైత్రి హిందూ
పారావారాంకమందు పరివర్ధితమౌ!

ఒకటే రాష్ట్రము నేడు భారతము యు
ద్ధోన్మాదులన్ కూల్చగా
ఒకటే మాట విరోధి సైన్య సమర
వ్యూహమ్ములన్ చీల్చునాన్
ఒకటే శక్తి సమైక్యభారత జన
జ్యోతీందిరా మూర్తిమాన్
ఇక ఈ దిగ్విజయోత్సవ ప్రభలు దీ
పించున్ జగద్వీధులన్ !

(1971 బాంగ్లాదేశ్ విముక్తి పోరాటకాలంలో పొంగిన భావవీచిక)

# నివేదన

ఉన్నావో లేవో ఎట
నున్నావో తెలియకున్న దోయి మహేశా !
నన్నేల సృజించితివో
ఇన్నిన్ని అయోమయాల ఇడుమల మధ్యన్

భయ శంకలు, బాధలు, వి
స్మయముల నన్నావరించి మరి మరి వేచున్
లయ తప్పిన శ్రుతి యయ్యెను
క్రయ విక్రయ వీధి యయ్యెగా నా బ్రతుకే !

ఎక్కడనో గల తారలు
ఇక్కడ పడియున్న నన్ను ఏడ్పించునురా !
ప్రక్కన గల చిరుగాలులు
మక్కువతో అనునయంపు మాటలు చెప్పన్

రక రకముల గొంతులు నను
చక చక రమ్మంచు దశ దిశలలో పిల్చున్
చకితుడనై ఎటు తోచక
అకటా ! ఎట నుండినానొ అటనే ఉంటిన్ !

నా ఎదలో శివ మెత్తిన
మాయల ఊహములు, మంచుమల కొమ్ములపై
ఊయల లూచుచునే పడ
ద్రోయును నను లోయలను అధోలొకములన్.

తమసమ్ముల కనగానే
హిమమై పోవుదును శక్తి హీనుడ నౌదున్
కమలాప్తు దీప్తి కనగనె
అమితావేశాగ్ని శిఖల కాహుతి యగుదున్.

తెలిమబ్బుల మైదాన
మ్ముల జాబిలి బంది యాడ బోయి, నిరాశన్
జలధి హృదంతర మౌక్తిక
ముల రత్నము లేరు కొనగ ముచ్చట పడుదున్.

అర్థము వెంట ఒకపుడు, ప
దార్థ జ్ఞానమ్ముకోసమై మరొకపుడున్
స్వార్థమ్ముల వెంటను, పర
మార్థమ్ముల వెంట బడి నిరర్థకు నైతిన్.

మారుతమువోలె నా ఊ
హా రుతములు నిల్వలేవయా ఒకచోటన్
నీరదము వోలె నా ఎద
మారుచునే ఉండు ఏది మార్గమ్ము ? ప్రభూ !

నా కనుల భ్రాంతి కొల్పెడి
చీకటి తెరలేవా కలవు చిక్కవు నాకున్
లేకుండిన అడుగడుగున
నా కెందుకు ఇన్ని మాయ నాగులు తగులున్

అది తుది లేని సృష్టికి
కా దని ఔ నంచు నీవె కారణ , మెంతన్
వాదించి వివాదించిన
లేదు సమాధాన మెరుగలేరు నిజమ్మున్

నా క్షుభితమైన మేధకు
ఏ క్షణమున శాంతిలేదు ఈ చీకటిలో
చక్షువు నా కీవే పరి
రక్షణ మీవేను చూపరా వెల్గు ! ప్రభూ !